# హిందూ మతము - మన పండుగలు

*

మహా మండలేశ్వర్, భాగవత చరిత వ్యాస్

శ్రీరామశరణ్

**కుందుర్తి వేంకట నరసయ్య**

*

నామప్రయాగ

బుద్దాం (P.O.)

(గుంటూరు జిల్లా)

# ఉపోద్ఘాతము

మన భారతదేశ మతి ప్రాచీనమైనది. మనహిందూమతమునునతి ప్రాచీ
నమైనది. మన హిందూమతము పుట్టి షుమారు 196 కోట్ల సంవత్సరములై
నది. అతీంద్రియజ్ఞానముకల మహర్షులు అనుభవపూర్వకముగ శోధించి
నిర్మించిన మతమిది. దీనికి మార్పులు చేర్పులనవసరములు. ప్రపంచమున
నిప్పుడు ప్రచలితములైన మతము లన్నిటికిని నిదియే తల్లి. దీనిలోని
కొన్ని ధర్మములను దీసికొని, అనేకమంది అనేకమతము లను స్థాపించుకొ
నిరి. మహమ్మదీయ, క్రైస్తవ, పారసీక, బౌద్ధ, సిక్కు, ఆర్య, బ్రహ్మ
సమాజాది ఆధునిక మతములును హిందూమతమందలి శాఖలే. హిందూ
మత గ్రంథములందు జెప్పబడని తత్త్వముగాని, ధర్మముకాని, సాధన
గాని యింకొక మతమున లేదు. కానిఆయా శాఖలవారు వారిదే గొప్పమ
తమని చాటుకొనుచు మతములను వేర్పాటుగావించితమతమ మతములందు
జేర్చుచున్నారు. వారి ననవలసిన పనిలేదు. వాటిలో జేరువారికి తగినపరిజ్ఞా
నము లేదు. పరిజ్ఞానము లేక పోవుటకు కారణము మనము చెప్పకపోవు
టయే. తగిన ప్రచారమును చేయకపోవుటయే. హిందువులందఱును
మేల్కొని, తమతమ సంస్కృతినికాపాడుకొనుచు మనది విలక్షణమగునాష్
మతమనిలోకమునకు జాటవలసిన సమయమాసన్నమైనది. అట్టి మతసం

సంస్కృతిని కాపాడుటకు మన పండుగులలోని విశేషములను బాగుగా దెలిసికొని ఆచరించుటయే ముఖ్య కర్తవ్యమగును. మనకు వచ్చుపండుగులలో విశేష మేమో, ఎట్లాచరింపవలయునో తెలిసికొనుట అత్యంత అవసరమగుచున్నది. ఆ పవిత్రమగు నుద్దేశ్యముతో నీచిన్ని పొత్తమును రచించుట జరిగినది. దీని నందఱును బాగుగా జదివి ఆచరించి యథార్థమగు హిందువుల మని పించుకొనవలెనని మా కోరిక.

మా యీ గ్రంథమును బరిశీలించి దీని ముద్రణమునకు 2000 రూపాయలు మంజూరు చేసిన తిరుపతి తిరుమల దేవస్థానాధికారులకు మా కృతజ్ఞతలను హృదయపూర్వకముగ నర్పించుకొనుచున్నాము. వారితోధిక ముగ నిట్టి ఆధ్యాత్మిక ధర్మ గ్రంథములకు సహాయమొనర్చెదరని ఆశించు చున్నాము. శ్రీ తిరుమలేశుడగు వేంకటేశ్వరస్వామి వారి కాయురారోగ్య భాగ్యముల నొనగూర్చుగాక.

బుద్దాం,
విజయదశమి

ఇట్లు
శ్రీరామశరణ్
కుందుర్తి వేంకటనరసయ్య

శ్రీరామాయ నమః

# హిందూ మతము - మన పండుగలు

శ్లో॥ శ్రీరామం జానకీనాథం సర్వలోకేశ్వరేశ్వరం
శ్యామలం కోమలం వందే శ్రీరామశరణావనం ॥

మన హిందూ మతము మొదట సర్వప్రపంచమున వ్యాపించియున్నది. ఇది కేవలము వేద మతము. వేదము లపౌరుషేయములు, ఆత్మ ద్రష్టలగు మునులు భగవంతుని నిశ్వాసరూపములగు వేదములను మొదట వినిరి. వారు ధారణ చేసి శిష్య పరంపరకుఁ జెప్పిరి. అందువలననే వీనికి శ్రుతులను పేరువచ్చినది. వీనికి స్వరము కలదు. అనంతకాలము నుండి యీ శ్రుతులకు స్వర మొక్కటే వచ్చుచున్నది. స్వరభంగము కలిగిన నర్థభేదము కలుగును. అర్థమునుబట్టి ఫలము కలుగును. అందువలన వేదమును గురువుకడ స్వరయుక్తముగ సంతను జెప్పించుకొని అధ్యయనమును జేయవలసినదే కాని పుస్తకమును జూచి చదువ వీలుండదు. ఆ శ్రుతుల లోని అర్థరహస్యములను వివరించునవి స్మృతులు. వీని ననేకులగు ఋషులు ప్రవచించిరి. వీటిలోఁ గొన్ని యర్థభేదములున్నవి. అందువలన వ్యాసమహర్షి వీని యర్థములను బురాణముల రూపమున, గొన్ని యితిహాసముల తోడను, గధలతోడను జోడించి చెప్పిరి. మన మతమునకు

'ఆర్షమత'మనియుం బేరుకలదు. హిందూమతమను పేరు పాశ్చాత్యులవలన వచ్చినది. 'హీనులను దూషించు మతము హిందూమతము. హిమాలయములు మొదలుకొని (దక్షిణ) సింధువు (సముద్రము) వఱకు వ్యాపించిన దేశము హిందూ దేశము. పాశ్చాత్యులు మొదట మన దేశమునకు వచ్చినపుడు సింధునదినిం జూచిరి. పారశీక భాషలో 'స'కును బదులుగా 'హ'వచ్చును. 'సింధు' అనునది 'హిందు' అయినది. ఏమైనను ఇప్పుడు మన దేశమునకు హిందూదేశము పేరు సార్థకముగ వ్యవహారమునయున్నది కావున మనమింక హిందూదేశమనియు, ఇందు ఇతరమతములకు ప్రబలిన మతమును హిందూమతమనియే పిలిచెదము. క్రైస్తవమతము 1979 సంవత్సరముల క్రిందటను, మహమ్మదీయ మతము 13... సంవత్సరముల క్రిందటను, బౌద్ధ మతము షుమారు 2500 సంవత్సరముల క్రిందటను బుట్టినవి. మన మతము 195...79 సంవత్సరములనుండియున్నది. ఇది ప్రపంచమంతటను వ్యాపించినది. పాశ్చాత్యులు అమెరికాను కనుగొన్నది షుమారు 400 సంవత్సరముల క్రిందటనే. కాని అంతవఱకే అచ్చట మన మతము వ్యాపించి నట్లనేక నిదర్శనములు కలవు. అచ్చట గణపతి, శివ మొదలగు విగ్రహములును దొఱకినవి. అట్టి వ్యాపకమగు మతము ఇతరమతముల ప్రభావమునకు లోనై తగ్గిపోయినది. కాని దీనివిలువ చెడనిది.

మనమతమునకు కొన్ని సిద్ధాంతములు కలవు. వానిని మార్చుటకు వీలుండదు. ఎన్ని పరిశోధనలొనర్చినను ఇవి

మూరనివి. ప్రకృతి శాస్త్రము (Science) నకును నివి సమా
ధానమును జెప్పఁగలవు. పరిశోధనమున మన ఋషు లొన
ర్చిన పరిశోధనము నింకెవరును నింతవఱకు చేయలేదు. సమస్త
శాస్త్రములును నిచ్చట పరిణతి చెందినట్లు ఇంకెచ్చటను జెంద
లేదు. గొప్ప తత్త్వవేత్తయు, విజ్ఞాన ఘనియునగు మాక్సు
ముల్లరు పండితుఁ డంతటివాఁడు హిందూమతముతో సమాన
మగు మతము లేదనియు, హిందూ విజ్ఞానమునకు సమానమగు
విజ్ఞానము లేదనియు వేనోళ్ల చాటినాడు. మన శాస్త్రములు
మన ఋషులయొక్క అత్యున్నత మేధా సంపత్తిని జాటుచున్నవి.
ఇప్పటివలె ననేక యంత్రసామాగ్రి లేకుండినను వారతీంద్రియు
లగుటచేతను, దివ్యదృష్టి, దివ్యశ్రవణము, దివ్యజ్ఞానము కల
వారగుటచే వారి శక్తిచేతనే సమస్త శాస్త్రములను నవగా
హన చేసికొని, బ్రహ్మాండమునఁగల ననేక విశేషములను
గ్రహించి గ్రంథరూపమున నా విజ్ఞానమును లోకమునకు
వెలువరించిరి. రాకెట్లు, స్పుత్నిక్కులు లేకుండినను నన్య
ఖగోళమునందలి లోకములలోని విషయములన్నిటిని జెప్ప
గలిగిరి. వారు జ్యోతిశ్శాస్త్రమున ఖగోళమందలి అనేక విచిత్ర
విషయములను గూర్చి వివరించిరి. ఇప్పుడు రాకెట్లతో వెళ్లి
నను నవియే గోచరించును వారు తమ యోగశక్తిచే నితర
లోకములకు వెళ్లినట్లు మన పురాణములలో ననేకోదాహరణ
ములు కలవు. విమానము నిప్పటికంటె నింకనెక్కువగ నుండి
నట్లు పురాణములందు చెప్పబడినవి. సౌభరివిమానము, పుష్పక

విమానము మొదలైనవి. భారతమున మయసభను గాంచి ప్రజలు 'ఇది విమానమున్నట్లున్న'దని అనుకొనిరి. ప్రజలకు విమాన పరిచయమున్ననే యిట్లనుకొనుటకు వీలు కలుగును. గణితము జ్యోతిష్యము, ఖగోళ విజ్ఞానము, భూగోళ శాస్త్రము, జలార్గళ శాస్త్రము, పదార్థ విజ్ఞానశాస్త్రము, వైద్య విజ్ఞానము, శరీర శాస్త్రము, రసాయనిక శాస్త్రము, మంత్ర శాస్త్రము, తంత్ర శాస్త్రము, సాముద్రికము, తత్త్వశాస్త్రము. యోగశాస్త్రము ముఖ్యముగ వేదాంతశాస్త్రమును క్షుణ్ణముగఁ దఱచి భగవంతుని నెన్ని దృక్కోణములతోఁ జూడనగునో, అన్ని దృక్కోణములతోఁ జూచిరి. వీనిని గ్రహింపక, గ్రహింపలేక, గ్రహింపవలయునను నాలోచనయే లేక; పాశ్చాత్య విజ్ఞానమునకును, భాషకును, సంస్కృతికిని దాసులై కొందఱు అన్యమతములలోఁ జేరుచున్నారు.

మతము ఆత్మకు శాశ్వతానందమును లభింపజేయవలయును. దానిమార్గమును హిందూమతము చెప్పినట్లింకేమతమును జెప్పలేదు. బ్రదికియుండగనే ముక్తస్థితిఁ బొందుమార్గమును హిందూమతము చెప్పినది. శాశ్వతానంద మార్గమేదో నిర్దేశించినది. కొన్ని యితరమతములలో రాజకీయ ప్రభావము కూడ కలదు. కామినీ కాంచనములను నెరగాఁబెట్టి సంఖ్యాబలము కొఱకు తమ మతములోఁ జేర్చుకొనుచున్నారు. అది పరమార్థమునకు బనికిరాదు. దానివలనఁ బ్రయోజనమేమియు

నుండఁజాలరు. తత్త్వమును దెలిసికొని ఆత్మానందము ననుభవించుటకే మతమును సంగతిని మఱచుచున్నారు.

మన మతమందలి ముఖ్య సిద్ధాంతములను బాగుగాఁ దెలిసికొనవలయును. మనకు పూర్వజన్మ మున్నదనియు, ముందుజన్మ మున్నదనియు విశ్వసించెదము. కర్మ సిద్ధాంతము ననుసరించెదము. మహమ్మదీయులును, క్రైస్తవులును పూర్వజన్మ పునర్జన్మల నంగీకరింపరు. అట్టివారి శరీరములను బూడ్చెదరు గాని దహన మొనర్పరు. దహనమొనర్చెడు హిందువుల యాచారమే శ్రేష్ఠమైనది పంచభూతములు సమిష్టి పంచ భూతములలోఁ జేరుట కిది ముఖ్యమును, నుత్తమమగు నాచారము.

పునర్జన్మ, పూర్వజన్మ లేకుండిన్న మానవులలో కొందఱు భాగ్యవంతులు, కొందఱు బీదవారు, కొందఱు రూపవంతులు, కొందఱు రూపహీనులు, కొందఱు తెలివిగలవారు, కొందఱు తెలివితక్కువవారు, కొందఱు విజ్ఞానవంతులు, కొందఱు జ్ఞానవిహీనులుగ నెందుల కుండవలెను? వారి వారి కర్మలను బట్టియు, సంస్కారమునుబట్టియు, నీ భేదము లేర్పడినవని గ్రహింపవలయును.

క॥ కర్మమును బుట్టు జంతువు
కర్మమునను వృద్ధిఁబొందుఁ గర్మమునఁ జడున్
కర్మము జనులకు దేవత
కర్మము సుఖదుఃఖములకుఁ గారణ మధిపా॥(భారతము

పాశ్చాత్యవేదాంతులు పూర్వజన్మను, పునర్జన్మను విశ్వసించెడువారు కారు. కాని యీ శతాబ్దములోనే ప్యారిస్‌నగరములో నొక ఫ్రెంచి పిల్లకు సన్నిపాతరోగము సంభవించి దానిలో ప్రేలాపనము పుట్టెను ఆప్రేలాపనమందామె యనేక విధముల మాటలాడుచుండెను. ప్యారిస్ విశ్వవిద్యాలయమందలి వివిధ భాషోపన్యాసకులను బిలిపించిరి. ఆమె ప్రేలుటలో పదునెనిమిది భాషలను మాటలాడినది అందులో ఆఱు మన భారతీయభాషలును గలవు. యథార్థమున కామె ప్యారిస్ నగరముదాటి యెచ్చటికిని పోలేదు. ఆమె చదువులో ఫ్రెంచి. ఇంగ్లీషు భాషలను తప్ప యింకే భాషను నేర్వలేదు. ఆమె యిన్ని భాషల నెట్లు మాటలాడగలిగినదని పాశ్చాత్య వేదాంతులు చర్చించిరి. చివరకు వారు, ఆమె పూర్వజన్మలలో నీ భాషల నన్నిటిని నధ్యయనము చేసియుండవలె నని నిర్ధారించిరి. పూర్వజన్మము, పునర్జన్మము లున్నవని అప్పటినుండి నమ్ముచున్నారు.

## పుణ్యపాపములు

మంచిపనులు చేసిన పుణ్యమును, చెడ్డపనిని జేసిన పాపమును సంభవించుట తథ్యము. ఏపనిని చేయరాదో, ఏపనిని చేయవచ్చునో వేదములు, శాస్త్రములు నిర్ధారించినవి. మంచి గంధములో చేతిని బెట్టిన జల్లగను, సువాసనగను నుండు

నదియు, కారములోఁ జేతిని బెట్టిన మండునదియు నెవరును జెప్పనక్కఱలేదు. అందఱకును దెలియును. లోకవేదముల ననుసరించి మనము కర్మలొనర్మవలయును. ధర్మమననేమో, అధర్మమేదియో శాస్త్రములు నిర్ణయించినవి. ఆ శాస్త్రముల ననుసరించి మనము నడిచితీరవలెను.

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥ ॥గీత॥

ఫలాని కార్యమును జేయవచ్చును, ఫలాని కార్యమును జేయరాదనుటకు శాస్త్రమే ప్రమాణము. శాస్త్రములలో జెప్పబడినదానిని తెలిసికొని కర్మలొనర్పవలయును.

'మాకు శాస్త్రములో నేమున్నదియో తెలియదు. కావున ఏదోచేయుచున్నా'మన వీలులేదు ప్రభుత్వమే దేనినొక శాసన మొనర్చిన దాని నుల్లంఘించి, నా కట్టి శాసనము చేసినట్లు తెలియదనిన ప్రభుత్వము శిక్షింపకమానదు. తెలిసికొనవలసిన బాధ్యత మనమీద నున్నది. శాస్త్రము నుల్లంఘించిన శిక్ష తప్పదు. రాజకీయ శాసనముల విషయము నొక న్యాయవాది నడిగి యెట్లు తెలిసికొందుమో అట్లే మత ఆధ్యాత్మిక విషయములును వానిని బాగుగా నెఱిగిన పండితులకడకు బోయి తెలిసికొనవలెను "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే" యని ప్రతిదినమును పారాయణమొనర్చు గీతాధ్యయన మొనర్చువారే, దానిలోని శ్లోకములకు శాస్త్రవిరుద్ధముగ

నర్థములను లాగి ప్రజలను పెడత్రోవను బట్టించుచున్నారు. అసూయా, ద్వేషములు లేక ప్రజల క్షేమమును గోరుచు, న్యాయముగ శాస్త్రము ననువర్తించు పండితులకడ శ్రవణ మొనర్చిననే శాస్త్రమందలి యథార్థవిషయములు తెలియ గలవు. శాస్త్రములు శాసించును. ఆ శాసనము నుల్లంఘింప రాదు. రాజకీయముగ శాసనోల్లంఘన మొనర్చినట్లే శాస్త్ర ములనుగూడ ఉల్లంఘించు ప్రబుద్ధులీ కలియుగమున జన్మించి నారు. శాస్త్రములు విధినిషేధములను జెప్పినవి. ఫలాని విధ ముగ ఫలాని పనుల నవశ్యము చేయవలెనను విధులను, ఫలాని పనులను సర్వథా చేయరాదను నిషేధమును జేసినారు. విధుల నాచరింపకుండుటచేతను, నిషేధముల నాచరించుటచేతను బాపములు వచ్చును. నిషేధములను వదలి, విధులను సక్రమ ముగ నిర్వర్తించినచో బుణ్యములును వచ్చును. పుణ్యముల నొనర్చుటచే స్వర్గమును, నిషేధములను ఆచరించిన నరకమును దప్పదు.

ప్రకృతి శాస్త్రము ననుసరించియు పుణ్యపాపములను నిర్ణయించిరి. మన శరీరములో గోట్లకొలది జీవాణువులు కలవు. అవి సూక్ష్మముగనుండి కుడివైపునకు (ప్రదక్షిణముగ) దిరుగుచుండును. ఏదేని పాపమొనర్చిన నా జీవాణువులే (అప్రదక్షిణముగ) యెడమవైపుగ దిరుగును. కొన్ని ప్రదక్షి ణముగను, కొన్ని అప్రదక్షిణముగను దిరిగిన ఆ రెంటికిని

సంఘర్షణము కలుగును. అప్పు డేదో రోగము సంభవించును. శ్లో॥ 'పూర్వజన్మ కృతం పాపం వ్యాధిరూపేణ బాధతే' అను శాస్త్రి మీ వచనమున సత్యము. ఆ ఘర్షణమువలన వాత, పిత్త, శ్లేష్మములలో వ్యత్యాసము కలుగును. అదియే రోగము. అందుకనియే దేవునకు ప్రదక్షిణ మొనర్చినను, బ్రాహ్మణు నకు, రావిచెట్టు, తులసీవృక్షము మొదలైనవానికిని, పెండ్లిండ్లు మొదలగువానిలో నూరేగింపు ప్రదక్షిణముగ దిరుగుటచే మన శరీరములో నప్రదక్షిణముగ దిరిగిన సూక్ష్మాణు వులు మరల ప్రదక్షిణముగ దిరుగును. అదియే పాపము పోవుట, జప, ధ్యాన, పూజాదులవలనను భగవన్నామ సంకీర్తనము వలనను కూడ పాపములు నశించుచున్నవి. ఈ పుణ్యపాపముల సంస్కారములు మన అంతఃకరణమున బడును. అవి సూక్ష్మముగనుండును. ఏ భాష వచ్చినవాడు ఆ భాషను దెలిసికొని మొల్లుచదువునో అట్లే యమదూతలు మన యంతఃకరణమునంగల మన పుణ్యపాప సంస్కారము లను జదివి, ఏ జీవిని నేలోకమునకు గొనిపోవలయునో ఆ లోకమునకు బంపించెదరు.

## స్వర్గ నరకములు

కొందఱు స్వర్గనరకములు లేవందురు. ఎక్కడున్నవో ఏ అక్షాంశ రేఖాంశములమీాద నున్నవో చెప్పిచూపుడం దురు. ఇది మొండివాదము. ఆ వాదించువారి మనస్సు,

బుద్ధి ఎచ్చట నున్నదో చెప్పుమనుడు, చూపుమనుడు. చూప గలిగిననే వారికి బుద్ధియుండినట్లు, చూపజాలకుండిన బుద్ధి లేనట్లే 'యథా పిండాండే తథా బ్రహ్మాండే' మనశరీరమున నెట్లో బ్రహ్మాండమునను నట్లే యుండును. ఎప్పటికైనను స్థూలములకంటె సూక్ష్మములుపైన నుండును. మూలాధారము పృథివీ తత్త్వము (మలేంద్రియము) స్వాధిష్ఠానము (మూత్రేంద్రియము జలతత్త్వము. దానిపైన బొడ్డుదగ్గర అగ్నితత్త్వము. ఇది మణిపూరకము. ఇదియే జఠరాగ్ని. దానిపైన వాయు తత్త్వము. ఊపిరితిత్తులు, హృదయస్థానము, అనాహతము. దానిపైన గంఠమున నాకాశతత్త్వము. ఇది విశుద్ధము, దానికిపైన భ్రూమధ్యమున ఆజ్ఞా చక్రము, జీవస్థానము ఆపైన సహస్రారము, పరమాత్మతత్త్వము, ఇట్లు శరీరమున, నెట్లున్నవో అట్లే ఊర్ధ్వమునకు బోనుపోను సూక్ష్మలోకములు కలవు. గరుడ పురాణమున సంయమినీ (యమలోకము) పురము దక్షిణమునకు నైరృతికి మధ్యనుండినట్లు చెప్పఁబడి నది. అట్లే స్వర్గమును సూర్యమండలమునకు బైనగలదు. ఒక లోకమునుండి యింకొక లోకమెంతదూరముకలదో మనశాస్త్రములు చెప్పుచున్నవి హిందీలో ప్రసిద్ధమగు 'కల్యాణ్' పత్రికయందు యమలోకమునకుబోయి, తిరిగివచ్చి బ్రదికినవారి యుదంతములు వ్రాసినవెన్నియో కలవు. వారు ఈ శరీరమును వదలి అచ్చటి సంగతులన్నిటిని పూసగ్రుచ్చి నట్లు చెప్పిన నుదంతములు కలవు. అవన్నియును మన

పురాణములలో జెప్పబడినవానికి సరిగా సరిపోవుచున్నవి. వానినీ స్థూల శరీరముతో ననుభవింప వీలులేదు. సూక్ష్మ శరీరముతో ననుభవింప వలసియున్నది. స్థూల శరీరముతో ననుభవింపవలసినవియును గొన్నికలవు. ఉదాహరణమునకు— ఒకడొకని వద్ద కొంతద్రవ్యమును దొంగతనము చేసినాడనుకొనుడు. అతడు మరణించిన తరువాత నరకమునకుబోవును. అచ్చట ఆతని దొంగబుద్ధికై శిక్షజరుగును. కాని యిచ్చట ఎవనివద్ద ద్రవ్యమును గాజేసినాడో వానికా ద్రవ్యము చేరలేదు కదా! దానికొఱకై వాడు వాని గొడ్డుగానో, బిడ్డగానో, ఇంకేవిధముగనో పుట్టి వాని బాకీని తీర్చవలసియుండును. కొన్నిపాపములకు రెండు శిక్షలుండును. ఒకటి పరలోకమునను, మరల పుట్టిన తరువాత భూలోకమునను నుండును. అవశ్యము పాపపుణ్యములకు ప్రతిఫల రూపమగు నరక స్వర్గములు, కష్టసుఖములుండును. కొన్ని కొన్ని తీవ్రతమమగు పుణ్యకార్యములచే బాపములు నశించును. సామాన్య పుణ్యకార్యములచే బాపములు నశింపవు. పాపములకు బాపములే, పుణ్యములకు బుణ్యములే యుండును. కాని భగవత్సంబంధమగు పూజ, జపము, సంకీర్తనము, నామస్మరణము మొదలగువానిచే బాపములన్నియును నశింపగలవు. పుణ్యములొనర్చినను అవి క్షీణింపగనే భూమిమీద బుట్టవలసినదే, 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' అని శాస్త్రము కదా! పుణ్యములొనర్చుచు, వానిని భగవదర్పణ మొనర్చుచుండిన

నా పుణ్యకర్మములకు ఫలముండదు. పాపకర్మములు చేయ రాదు. పుణ్యకర్మములు భగవదర్పణములు కాగా, పాపకర్మ ములు లేకపోగా వానికి జన్మముండదు. అతడు ముక్తుడే, ఏ మతమైనను నీ స్థితిని గలిగింప వలయును. మతము లూరక పైపైనగల సంఘముల వలన నేర్పడినవి కావు. మతములో నిందరున్నారని తెలుపుకొనుట మతాంతరములను బలవంతము గను, కామినీ కాంచనముల నెఱగా జూపియు జేయుటచే నేమియును ప్రయోజనము లేదు. అది చివరకు రాజకీయ పరమగును. బాహ్య ప్రయోజనములకే పనికివచ్చును. మతము మనస్సును లోనకు, భగవదనుభవముకడకు గొని పోవలయును, అటు కొనిపోవుటకు సాధనలున్నవి. కొన్ని శారీరకములగా. కొన్ని ఇంద్రియములకును, కొన్ని మనోబుద్ధి చిత్తాహంకారములకును సంబంధించి యుండును. వీనిని జేయగా జేయగా జైవధర్మములద్వారా జీవుని బ్రహ్మములో జేర్చవలెను. లేదా సాన్నిధ్యమునకు గొనిపోవలయును. దానికి తగిన సాధనలన్నియును హిందూమతమున గలవు. ఇంత విపులముగను, ఇంత అనుభవయుక్తముగను సాధన లింకేమతమునందును జెప్పబడలేదు. కాని వానిని దెలిసి కొనుటలేదు. పాశ్చాత్య విద్యలకును, సంస్కృతికిని లోనై వీనియందు శ్రద్ధను మానుచున్నారు. మన ఆచారములును, మన ఉపాసనా విధానములు ప్రకృతి (Science) శాస్త్రము నకు సరియగు ఋజువౌనగును.

# ఆచారము

వర్ణాచారము, దేశాచారము ననుసరించి వర్తింప వలెను. కొందరు వర్ణము లుండరాదందురు. అది చాల పొర పాటు. ప్రభుత్వములో శాఖలుండరాదనుట యెంతటి అజ్ఞానమో ఇదియు నంతటి అజ్ఞానమే. ఒక్కడుగ నెవడును నన్ని కార్యము లొనర్పజాలడు. వివిధములగు శాఖ లుండ వలెను. అవి యుండిననే ప్రభుత్వము సక్రమముగ జరుగును. అంతఃకరణ నొక్కే చదువు పనికిరాదు. ఒకేవృత్తి పనికిరాదు. అన్నియు నుండవలయును. ఏశాఖ కాశాఖయే గొప్ప అయి నట్లు ఏవర్ణమున కావర్ణమే గొప్ప. ఏదైన మంచిపాటను విన వలసినప్పుడు చెవులే గొప్ప. ఏదైన మంచి దృశ్యమును జూడ వలసినప్పుడు కన్నులే గొప్ప. ఏదైన నత్తర్లు వాసన చూడ వలసినపుడు ముక్కే గొప్ప. ఏదైన మంచి పదార్థమును రుచి చూడవలసినప్పుడు నోరే గొప్ప. పూర్వము మీా వర్ణము లుండినను బరస్పర ప్రేమతోడను, సహాకారముతోడను వర్తించుచుండిరి. కాని నేటికాలమున కొందఱు స్వార్థపరులు పరస్పరము ద్వేషములను బుట్టించి దేశములో నైకమత్యము నకు భంగమొనర్చుచున్నారు. సర్వమానవులును శరీరములోని అవయవములవంటివారు. ఇందులో నెవరికి హాని, నష్టము కలిగినను సమస్త మానవకోటికి నష్టముకలుగును. పరస్పరము ప్రేమ వర్థిల్లవలెను. సర్వమానవ భ్రాతృత్వము వర్థిల్లవలెను.

అందఱును, శాంతితో, ప్రేమతో, పరస్పర సహకారముతో దేశ ప్రగతిని సాధించుచు భగవంతుని జేరుటకు ప్రయత్నింప వలయును. దానికి సదాచార సాంప్రదాయము చాలముఖ్యము. సదాచారమున సత్పురుషులగువా రేవిధముగ నడిచిరో ఆవిధముగ నడువవలయును. 'ఆచార హీనం న పునంతి వేదాః'అని శాస్త్రము. ఆచార హీనుని వేదములు పవిత్రముచేయజాలవు. 'ఆచారాదాయుః' ఆచారమువలన నాయువు పెరుగును. మన ఆచారముల ప్రకారము నడిచిన శరీరమునకును, మనస్సునకును, ఆత్మకును ఆరోగ్యమును కలిగించును.

## కట్టు, బొట్టు, జుట్టు

హిందువులకు కట్టు, బొట్టు, జుట్టు చాల ముఖ్యము. దేశ శీతోష్ణస్థితినిబట్టి కట్టు ఉండును. ఉత్తర దేశములో హిమాలయప్రాంతములో నెట్లున్నను మన దేశములో లాగులు తొడుగుట, ప్యాంట్లువేయుట ఆచారము కాదు. లుంగీలు కట్టుట అంతకంటె నీచమైన ఆచారము. గూడకట్టు లోన గోచీ లేకుండ కట్టరాదు. భూమికి ఆకర్షణశక్తి కలదు. అది మన లోని ప్రాణశక్తిని లాగివేయును. ఇప్పటి యువకుల ఆచార విచారములు చాల అధ్వాన్నముగ నున్నవి. కేవలము ఆడ వాండ్రు కట్టుకొను చీరలముక్కలనే లుంగీలుగాను, చొక్కా లుగాను కుట్టించుకొనుచున్నారు. సిగ్గుచేటు. దూరమునుండి చూచిన స్త్రీయైనదియును, పురుషుడైనదియును తెలియక

పోవుచున్నది. మన సంస్కృతిని పాటించవలెను. భారతమందు 'తగిన వేషంబు తన్నుదా పొగడుకొనము' అని కలదు. వేషము బట్టి బుద్ధి యేర్పడును. మన దేశస్థులకు పరదేశముల వారిని అనుకరించుట బాగుగా నలవాటు కలదు. హిప్పీలజుట్టు, లుంగీకట్టు ఎచ్చట చూచినను సిగ్గులేకుండ ధరించుట అలవాటైన . చక్కగా పంచకట్టు కట్టవలెను. బిళ్ళగోచీ పెట్టవలెను. చెంగు లన్నిటిని మడతపెట్టి దోపవలయును. మన శరీరమందలి శక్తి వస్త్రముయొక్క అంచులద్వారా పోవును.

## బొట్టు

బొట్టులేనిముఖము పాడుముఖము. బొట్టు వారవలంబించిన తత్త్వమునుబట్టి యుండును. శరీరమందలి చెడ్డరక్తమంతయు హృదయము దగ్గఱకు వచ్చును. ఆ రక్తము ధడక్, ధడక్ అని ఊపిరితిత్తుల దగ్గఱకు సూక్ష్మనాళములద్వారా పంపించును. మన మూపిరిని బీల్చగా నా ప్రాణవాయువు ఊపిరితిత్తులలోనికి బోయి అచ్చటికి వచ్చిన చెడ్డ రక్తము శుభ్రపఱచి మరల హృదయము దగ్గఱకు పంపును. హృదయము పదునొకండు ధమనులద్వారా శరీరమంతటను మంచి రక్తము వ్యాపించును. అందులో రెండు ధమనులు ముఖము మీదుగా దలలోనికి పోయినవి. అవి అతి సూక్ష్మ నరముల ద్వారా మెదడంతయును వ్యాపించును. వానినిజల్లపఱచవలెను. వానిలోని శైతమునుగూడనివారించి సమశీతోష్ణస్థితికి రావలెను.

అందువలన ముఖమున వైష్ణవులు నామము (తిరుమణి) ను, మధ్యలోఁ బసుపుతోఁ జేయబడిన తిరుచూర్ణమును ధరించె దరు. నామము నాడీమండలమును జల్లబరచును. పసుపుగాని, పసుపుతో చేయబడిన తిరుచూర్ణము, లేక కుంకుమ నాడీమండ లములోగల నెమ్మును లాగివేయును. దీనిలో వైష్ణవతత్వ విషయమును గలదు తెలుపునామము పరమాత్మను దెలుపును. తిరుచూర్ణము లక్ష్మిని (ప్రకృతిని) దెలుపును. నిలువుగ బెట్టు టచే ప్రకృతి పురుషు లిద్దరును శాశ్వతముగ నున్నారను నర్థము వచ్చును. పుండ్రములు పండ్రెండుచోట్లను బెట్టుదురు. ద్వాదశోర్ధ్వ పుండ్రములు, కంఠమున మూడు, ఉదరమునను, కాలేయము (Liver) మీదను (కుడిప్రక్క) ప్లీహము (Spleen) మీదను, హృదయమునను, భుజముల మీదను, మచ్చిలి గుంటయందును, నడుముమీదను ధరించెదరు. ఈ స్థానము లలో ధరించిన శరీర మండల మంతయును మంచి ఆరోగ్య స్థితికి వచ్చును

స్మార్త పక్షమునను గంధము భగవంతుని తెలుపును. కుంకుమబొట్టు ప్రకృతిని దెలుపును. భగవంతుడు వ్యాపకముగ నుండును గావున ముఖమునబూసెదరు. ప్రకృతి మిథ్యకావున, మిథ్యను సూచించునది '౦' సున్న. లేదను నర్థము కలదు. స్మార్తులు విభూతిని ధరించెదరు. భస్మమనగా భగవంతుడని అర్థము. అన్నియును నశింపగా మిగులునది భస్మము. అంత యును నశింపగా మిగులువాడు భగవంతుడేకదా!

అలాగే మధ్వమతములోను గోపీచందనముతో నిలువు బొట్టు పెట్టెదరు. భగవంతుడు జ్యోతిస్స్వరూపుడు కావున దీపము వత్తి యెట్లుండునో అట్లు పెట్టెదరు. వేణు (వెదురు) ఆకువలెను నుండును. దానిలో మసిబొట్టును బెట్టి దానిని పైకి లాగెదరు. అనగా భగవంతునితో బాటుగా ప్రకృతికూడ ఉన్నదను నర్థమును జెప్పును. కొందఱు శాక్తేయులు కేవలము కుంకుమను నడ్డముగ బెట్టెదరు. అనగా శక్తి తప్ప యింకొకటి లేదను నర్థము నొసంగును. ఇవన్నియును తత్త్వయుక్తముగ నుండును.

చివరకు మహమ్మదీయులును, క్రైస్తవులును బొట్టు పెట్టుట మంచిది. మహమ్మదీయులు అర్ధ చంద్రాకారమును గంధము లేక సుద్దతోను, నక్షత్రమును కుంకుమతోను బెట్ట వచ్చును. ఇది మన మతమున ప్రణవముపైని అర్ధమాత్రా స్వరూపమే.

అటులనే క్రైస్తవులు క్రాస్ (Cross) + ను నిలువుది గంధముతోను, అడ్డముది కుంకుమతోను బెట్టవచ్చును. అవి వారివారి మతతత్త్వమును దెలుపును. ఇంతకు + గుర్తు కూడ మనదే. వేదములో స్వస్తిక్ 卐 గుర్తు కలదు. దాని కొమ్ములను దీసివేసిన + మిగులును.

ఇంతకు ప్రతివానికిని బొట్టు అవసరము. ఏదో ఉద్యోగమును జేసిన బొట్టును దీసివైచి పాడుముఖముతో బాహ్యా

త్యులవలె నిప్పుడు తయారగుచున్నారు. అది అప్రాచ్యుల లక్షణము. మనము ప్రాచ్యులము అనగా తూర్పువారము. వేదము ననుసరించువారము. అప్రాచ్యుడు పడమటివాడు. వేద ధర్మముల ననుసరించనివారు. అప్రాచ్యుడన నీచుడను నర్థములో వాడుచున్నాము. మన మట్లుండరాదు. మన వేష భాషలను, మన సంస్కృతి ననుసరింపవలయును.

జుట్టును మన మతము, సంస్కృతి ననుసరించి యుండవలయును. మన కిప్పుడితరుల జుట్లు వచ్చినవి. అన్నియు ననుకరణములే. మన కిప్పటి జుట్లెట్లు వచ్చినవో విచారింతము. సగరుని తండ్రి అయోధ్యను బరిపాలించుచుండెను. చుట్టు నుండిన శత్రువులందఱును గలిసి ఆతని రాజ్యభ్రష్టుని గావింపగా నాతడు తన యిద్దరు భార్యలతో గంగాతీరమున నరణ్యములోనికి బోయెను. ఆతడు కొన్నాళ్లకు జచ్చెను. ఆతని యిద్దరు భార్యలు కట్టెలను ప్రోవుచేసి, చితిని బేర్చి, వెలిగించి సహగమన మొనర్చుటకై చితికి ప్రదక్షిణ మొనర్చుచుండిరి. ఇంతలో ఔర్వమహాముని కేకలు వేయుచు సహగమనమును జేయవలదని యిట్లనెను."అమ్మలారా! మీలో పెద్దామె కడుపున అమిత పరాక్రమవంతుడును, తేజస్వంతుడునగు బిడ్డ కలడు. ఆతడు చక్రవర్తి యగును. కావున సహగమన మొనర్పకుడు. మీరిద్దరును నా బిడ్డలు. మిమ్ములను నేను పోషించెదను. మా ఆశ్రమమునకు రండు" వారట్లే ఆతనియాశ్రమమునకు బోయెను.

గర్భము పెరిగెను. చిన్నభార్య యిట్లనుకొనెను. "ఈమె గర్భమున నుండిన శిశువు చక్రవర్తియగునట. అప్పుడు నా సవతి చక్రవర్తి మాతయగును. అప్పు డామెమాట సాగును గాని నామాటేమి సాగును ! కావున నాకులేని భాగ్య మీమెకుమాత్ర మేల కలుగవలయును" అని యాలోచించి ఒక పండులో విషమును గలిపిపెట్టెను. ఆ విషప్రభావమున గర్భము జారిపడవలసియుండెను. కాని యిదివఱకే ఔర్వ మహాముని గర్భమునకే హానియును గలుగకుండునట్లు తన తపశ్శక్తిని గర్భముచుట్టును బెట్టెను. ఆమె విషమును బెట్టినను గర్భము పతనము కాకపోవునప్పటికి తానింక బ్రతుకుటెందుల కని తన యుంగరమునందలి వజ్రము మ్రింగి చచ్చెను. నెలలు నిండగనే పెద్దభార్య ప్రసవమయ్యెను. ముందుగా నామె గర్భమునుండి విషము క్రిందబడెను. తరువాత తేజస్వంతుడగు పిల్లవాడు పుట్టెను అందువలన నౌర్వమహాముని యా పిల్ల వానికి సగరుడను పేరును బెట్టెను. అనగా విషములో బుట్టిన వాడని అర్థము. ఆతడు పదునైదు సంవత్సరములవాడగునప్ప టికి సమస్త విద్యలను, యుద్ధవిద్యను తాతగారివద్ద నభ్యసించి మిక్కిలి నిపుణుడయ్యెను. అది కృతయుగము. కృతయుగమున మైనరు వెళ్లుట పదునైదు సంవత్సరములకే. త్రేతాయుగ మున మైనరు వెళ్ళుట పదునాఱు సంవత్సరములను. అందు వలననే విశ్వామిత్రుడు రాముని దనవెంట రాక్షస సంహార మునకు బంపుమని దశరథుని గోరగా దశరథుడు యిట్లనెను.

'ఊన షోడశ వర్షోఽయం రామో రాజీవ లోచనః' పద్మ
పత్రాక్షుడగు రామునకు పదునాఱేండ్లు నిండలేదు. ఇప్పుడ
యుద్ధమున కెట్లు పంపుదుననెను. అనగా మైనరు వెళ్ళలేదనెను
ద్వాపరయుగమున మైనరు వెళ్లుట పదునేడేండ్లకు, కలియుగ
మున పదునెనిమిదేండ్లకు మైనరు వెళ్లును. కృతయుగమున
స్వాధీనపుహక్కు పదునైదేండ్లు. త్రేతాయుగమున స్వాధీనపు
హక్కు పదునాల్గు సంవత్సరములు. అందులకే కైకేయి
పదునాల్గు సంవత్సరములు రాముని అరణ్యమునకు బొమ్మ
నెను. ద్వాపరయుగమున స్వాధీనపుహక్కు పదుమూడు
సంవత్సరాలు. అందువలననే పాండవులను పండ్రెండు వత్స
రము లరణ్యవాసము, సంవత్సర మజ్ఞాతవాసము నేర్పఱ
చెను. కలియుగమున స్వాధీనపుహక్కు పండ్రెండు సంవత్సర
ములు. ఇది యిప్పుడమలులోనే యున్నది.

పదునేడేండ్లు నిండగానే సౌర్వమహక్కి అనుజ్ఞచే దన
తండ్రి రాజ్యమగు అయోధ్యమీదకు దండెత్తెను. శత్రువుల
నందఱను జయించి చెండాడెను. కాని కొందఱు బ్రాహ్మణు
లును, ఋషికుమారులును, క్షత్రియులును వశిష్ఠుని యాశ్ర
మమునకు బోయి ప్రాణరక్షణ చేయుమని ప్రార్థించిరి. వశిష్ఠు
డట్లేయని వారికి ప్రాణదానమొనర్చెను. ఈ సంగతిని సగరుడు
తెలిసికొని వశిష్ఠుని ఆశ్రమమునకు వచ్చి తన తండ్రి రాజ్య
భ్రష్టునిజేయుటకు కారకులైన వారినందఱను తలలు తీయుటకు
వదలఁడనెను.

వశిష్ఠుం డిట్లనెను :- "వీరికి నేను ప్రాణదానము నొసగితిని. ఇప్పుడు వీరిని నీ కప్పగించిన నేనబద్ధమాడినవాండ నగుదును. అట్లు వదలుటకు వీలు లేదు".

సగరు డిట్లనెను :- 'నేను మా తాతవద్ద గురుదేవపాదముల సాక్షిగా నా తండ్రిని రాజ్యభ్రష్టు నొనర్చినవారి తలలు తీసెద నంటిని. రాజునగు నే నసత్యమాడిన నా ప్రజలు సత్యమును బలికెదరా ! కావున వారిని వదలితీరవలయును, వారి తలలను నేను దీసి తీరవలెను "

వశిష్ఠు డిట్లనెను :- "మీ తాతవద్ద యేమని ప్రతిజ్ఞ చేసితివి !"

సగరుడిట్లనెను :- "నాతండ్రి రాజ్యభ్రష్టుడగుటకు కారకు లెవరో వారి తలలు గురుదేవపాదముల సాక్షిగా దీసెదను."

వశిష్ఠు డిట్లనెను :- "అట్లైన మన కిద్దరకును రాజీ కుదిరినది. నీవు తలలను దీసెదనంటివి. నేను ప్రాణములను గాపాడెద నంటిని. కావున నీవు జుట్టును దీసిన దలలను దీసినట్లే యగును. నేను ప్రాణములను రక్షించినవాడ నగుదును. అట్టి వారి నీ భారత దేశమునుండి బహిష్కరించుము."

అప్పుడు సగరుడు మొందుగా మునికుమారులను బిలిచి నున్నగా దలను గొరిగి పంపించెను. వీరికి మీసములు, గడ్డము

లక్ష్లే యుండెను. వీ ర రేబియా ప్రాంతములో నివాసమేర్పరుచు కొనిరి. వీరే తర్వాత మహామ్మదీయులైరి.

క్షత్రియులకు తలనిండ వెండ్రుకలు మధ్య పాపిడితో నుండెడివి. వారి నర్ధముండలను చేయవలయునని వెనుక జుట్టును గోసి దేశమునుండి బహిష్కరించెను. ఇదియే ఇప్పటి క్రాపు జుట్టు. వీరింకను బైకిపోయి పాశ్చాత్య దేశములలో స్థావర మేర్పఱచుకొనిరి.

వీరిలో కొందఱు బ్రాహ్మణులును గలరు. వారు మన మనవసరముగ నీ రాజకీయములలో బాల్గొనుటచే దివ్యమగు భారతదేశమును విడువవలసి వచ్చినది. కావున మన సంస్కృతియు, మన విజ్ఞానమును జెడకుండునట్లు ఒకచోటున స్థిరపడుద మని వారంద ఱొక్కచో నిలువబడిరి. ఆ దేశమునకు వారి జాతి పేరే పెట్టుకొందమనుకొనిరి. బ్రాహ్మణులకు 'శర్మన్' అను నకారాంత పుంలింగశబ్దము కలదు. ఆ దేశమునకు 'శర్మన్' దేశమని పేరు పెట్టుకొనిరి. అదియే చిలికి 'శర్మన్' అనునది 'జర్మన్'గా మారినది. ఇప్పటికిని వా రార్యులమనియు, వారికి ప్రమాణము వేదమనియు చెప్పుకొందురు. మన భారతదేశములో పోయినదిగాని జర్మన్ దేశమున నిర్బంధముగ సంస్కృతమును దప్పక చదివితీరవలసినదే. హిట్లరు మన వేదముల లోని స్వస్తిక్ '卐' గుర్తును తమ గుర్తుగ బెట్టుకొనెను.

మన మాడులో మూలాధారమునుండి బయలుదేరి వచ్చిన మజ్జాసుఖము సరిగా బ్రహ్మరంధ్రస్థానము వఱకు వచ్చును. బయటనుండి శక్తి మనలోనికి బ్రహ్మరంధ్ర స్థానముద్వారానే పోవును మనలోనుండి ప్రాణశక్తి బయటకు పోవుట కిరువది మార్గములు కలవు. చేతుల వ్రేళ్లు, కాలివ్రేళ్లు మనము పెద్దలకును, దేవునకును నమస్కరించునప్పుడు వారినుండి వచ్చుశక్తి మనలోనీ బ్రహ్మద్వారమున ప్రవేశించును. ఆశీర్వదించినను చేతుల వ్రేళ్ళద్వారా పెద్దలు వారి శక్తిని బ్రహ్మరంధ్రముద్వారా లోనికి ప్రవేశపెట్టెదరు. కావున ప్రక్కపాపిటలు తీయరాదు. మధ్యపాపిటతీయవలెను. అప్పుడు బ్రహ్మరంధ్రస్థానము తెఱచుకొని యుండును. ప్రక్కపాపిట తీసిన మన మూలశక్తికి వంచితులమయ్యెదము. ఆర్ష మార్గమున నడచు మగవారు మాడుపైన వెంట్రుక లుండకుండునట్లు గొరిగించెదరు. చిన్న మెదడు మాడునకు గొంచెముగ వెనుకభాగములో నుండును. దాని రక్షణకు వెంట్రుకల నుంచెదరు. అదియునుగాక ఉపాసనలో శిఖ అవసరము. హిందువుడైనవాఁడు తప్పక శిఖను ధరింపవలెను. ద్విజులు మూడు ఋణములతో బుట్టెదరు. దేవ ఋణము, ఋషి ఋణము, పితృణము. ఈ మూడు ఋణములకును మూడు ప్రామిశరీ నోట్లు కలవు. దేవఋణమునకు శిఖ, ఋషిఋణమునకు జందెము, పితృణమునకు మొలత్రాడు. ఈ మూడింటిని ఏమూడు ఋణములను దీర్చినప్పుడే తీసివేయవలెను. లేకుండిన

బ్రాంశకీనోటుకు చించివైచిన నెట్లు క్రిమినల్ నేరమగునో అట్లే జుట్టునుగాని, జందెమునుగాని, మొలత్రాటినిగాని తీసి వైచిన నది నేరమగును. సన్న్యాసి శాస్త్రీయముగ వీనిని దీసి వేయును. మన జాతీయతను నిరూపించుకొనవలయును. గాంధి మహాత్ముడు పిలకజుట్టును, కొల్లాయిని గట్టి తన జాతీయతను నిరూపించుకొనెను. హిందువులకు కట్టు, బొట్టు, జుట్టు ముఖ్యము. దాని నే పరిస్థితులందును విసర్జింపరాదు.

## మానవ జన్మ ఉత్కృష్టత

మానవుడు జంతువే. పుట్టినవాడు జంతువు. 'జంతూనాం నరజన్మ దుర్లభమ్' పుట్టినవారిలో మనుష్యజన్మ దుర్లభము. శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారిట్లనిరి :-

శ్లో॥ దుర్లభం త్రయమేవైతద్ దైవానుగ్రహ హేతుకమ్
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః ॥

(వివేకచూడామణి)

ప్రపంచములో మనుష్యత్వమును, మోక్షమును బొందవలయునను కోరికయు, మహాపురుషుని గురువుగ నాశ్రయించుటయునను, నీ మూడును లభించుట దుర్లభము. అవి దైవానుగ్రహమువలననే లభించును.

జీవరాసు లెనుబదినాల్గులక్షలు. రాళ్లు, చెట్లు, జంతువులు, మనుష్యులు. రాళ్లు, చెట్లు, జంతువులు 80 లక్షల జీవరకాలు. మనుష్యులు 4 లక్షలరకాలు. జీవి రాయి దగ్గఱ

నుండి మనుష్యుని వఱకు క్రమక్రమముగా బుద్ధ్యము నొనర్చి మానవుడైనాడు. 'ఆహారనిద్రా భయ మైథునం చ, సామాన్యమే తత్పశుభిర్నరాణామ్' ఆహారము, నిద్ర, భయము మైథునము ఈ నాలుగును పశువులకును, మానవులకును నొక్కటియే. ఊరక శారీరకముగా విచారించినచో పశువులకంటె మానవుడు హీనుడే.

పశువుల చర్మము డోళ్ళు, మృదంగము, కంజరి, పాదరక్షలు వీనికి బనికివచ్చును. మానవుని చర్మము దేనికిని బనికిరాదు. జంతువుల మాంసమున కుండిన గౌరవము, మానవుని మాంసమునకు లేదు. జంతుమాంసమును నింటిలో నుండనిచ్చెదరు. మానవుని మాంసము నెవ్వరును నుండనీయరు. గేదెలు, దూడలు, పందికొక్కులు, ఎలుకలు, జోరీగలు, బల్లులు, నల్లులు చచ్చుచుండిన నూరకున్నాము. కాని మానవుడు చావబోయిన చివరకు దండ్రియైన బైటపడవేయుదుగు.

ఏనుగు దంతములును, ఎముకలును చివరకు దేవుని విగ్రహాలు చేయించి పూజించుకొనుటకు బనికివచ్చును. కాని మానవుని ఎముకనుగాని, దంతమునుగాని తాకిన కార్శ్య రోగము సంభవించును.

గొఱ్ఱె మొదలగు జంతువుల నెండ్రుకలు చిత్రాసనములకును, కంబళ్ళకును బనికివచ్చును. ఇవి సదా పవిత్రములు. 'ఉత్తమం కంబళాసనమ్' అన్నారు. అన్నిటికంటె కంబళాస

నము శ్రేష్ఠము. చమరీ మృగముయొక్క తోకకుచ్చు వెంట్రు
కలు దేవునకు విసరు చేమరముగ బనికివచ్చును.

ఇక పులిగోరు పతకముగ నొనర్చి ధరించిన సమస్త
దోషములు పోవును. కాని మానవుని గోరు ఇంటిలో బడెనా
దుష్టగ్రహములు వచ్చును. దరిద్రము సంభవించును.

గోవుయొక్క మల మూత్రములు పరమ పవిత్రములు
కాని మానవుని మలమూత్రము లతి దుర్గంధ యుక్తములు.
దీనినిబట్టి శారీరకముగ జూచిన మానవుడు జంతువుల కంటె
హీనుడు

పోనిండు ఆహారము, భయము, నిద్ర, మైథునము
జంతువులకును, మనుష్యులకును సామాన్యము. ఈ నాల్గు
విషయములందును మానవుడు హీనుడే. జంతువులన్నియును
వాని ఆహారమునుగూర్చి విచారించుకొనుటలేదు. ఎప్పు డాకలి
యైన నప్పుడు బయలుదేరును. ఏదో ఆహారము దొఱకుచునే
యున్నది. మానవున కాహారము భగవంతుడు పెట్టలేదనుకొని
తనకును, తన పుత్రులకును, మనుమలకును, మునిమనుమలకును
ఆహారము లేదని అనేకములగు నధర్మములను గావించి సంపా
దించుచున్నాడు.

జంతువులు నిద్రను జయించినట్లు మానవుడు నిద్రను
జయించుటలేదు. యజమాని ఆహారమును గల్పించినాడని
శ్రమించి రాత్రులందును బనిచేయును. కాని మానవున
జంతువులు కొక్కటే నిద్ర.

మానవునకున్న ప్రాణభయము జంతువులకు లేదు. వానికి తమ గొంతుమీద కషాయమువచ్చి నపుడే భయపడును.

ఇక మైథునము విషయమునను జంతువులు కానిండు, పక్షులుకానిండు వానికి ఋతుకాలము వచ్చినపుడే సంతానాపేక్షను పెందును. కాని మానవుడు వేళను, ఋతుకాలమును స్వపరభేదమును బాటింపక మైథున క్రియయందు ప్రవర్తించుచుండును.

ఇట్టి పరిస్థితిలో మానవజన్మము దుర్లభమనుట యెట్లు పొసగును? మన్ To think = మన ఆలోచనే, అనుటచే మన అనఁగా నాలోచన మొనర్చువాడని యర్థము. అనిన నాహారనిద్రాభయ మైథునములను గూర్చిన యాలోచనములు కాదు. "నేనెవడను? ఎచ్చటినుండి వచ్చితిని ? ఎచ్చటికి చేరవలయునను దానిని గూర్చి యాలోచింపవలయును. అట్లాలోచించిన వాఁడే నిజమైన మానవుడు. దేవుని మఱచిన మానవుడు మానవుడు కాడు.

మన శరీరమున బంచభూతములు కలవు. అవి నిరంతరము బతనావస్థలో గలవు. మన శరీరములోని పృథివీతత్త్వము నిరంతరము పతనమగుచున్నది. దానికి మనము అన్నమును వేయుచున్నాము. ఉదయము 10 గంటలకు అన్నమును దిని, మరల సాయంత్రము 8 గంటలకు దినుచున్నాము. అనగా బృథివీతత్త్వమును బది గంటల కొకసారి సేవించుచున్నాము. పృథివి కంటె జలము సూక్ష్మము. తత్త్వమెంత సూక్ష్మమైన

నంత తఱచుగ సేవింప వలసి యుండును. ప్రతి గంటకును ద్రవ పదార్థమును సేవించుచుండవలయును 'ముహుర్ముహుర్వారి పిబేదభూరి' అని శాస్త్రము చెప్పుచున్నది. మాటిమాటికిని నెక్కువ కాకుండ నీటిని త్రాగవలయును.

నీటికంటె సూక్ష్మము అగ్ని. దానిని ప్రతి పావుగంటకును సేవింపవలయును. అనగా శరీరమందలి వేడిని తగ్గకుండు నట్లు చూచుకొనవలయును దానికంటె సూక్ష్మము వాయువు. వాయువును రోజునకు 21600 సార్లు శ్వాసించుచున్నాము. అనగా నిమిషమునకు 15 శ్వాసలను దీసికొనుచున్నాము. అనగా ప్రతి 4 సెకండ్లకును వాయువును సేవించుచున్నాము. వాయువునకంటె సూక్ష్మమైనది ఆకాశము. దీనిని ప్రతి క్షణమును సేవింపవలయును. ఒక్కక్షణము రక్తప్రసారము, శ్వాస ప్రసారమాగిన మనము చావ వలసినదే. మన శరీరములో నీయైదేనా ఉండునది. చైతన్యము కూడ కలదు ఈ యైదు భూతములు పీనుగులోగూడ కలవు. ఆఱవది చైతన్యము. ఇది ఆకాశమున కంటె సుసూక్ష్మము. ఆకాశమును క్షణమున కొకసారి సేవింపవలసి యుండిన వ్యష్టిచైతన్యము (జీవుఁడు) సమష్టిచైతన్యమును (భగవంతుని) నిరంతరము సేవింప వలయును. తనలో చైతన్యము లేనివాఁడు మాత్రమే (అనగా శవప్రాయుఁడు) దేవుఁడు లేడనవలెను. కావున ప్రతి మానవుఁడును తనకిష్టము వచ్చిన దేవుని భజించి తీరవలెను. ఏ కార్యములు చేయుచుండినను భగవంతుని జ్ఞాపకము పెట్టుకొన

వలయును. అందుకనియే శ్రీ కృష్ణభగవాను డర్జునునకు "తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుద్ధ్యచ" కావున సర్వకాలములందును నన్నుస్మరించుచు యుద్ధ మొనర్పుము'

## సగుణ నిర్గుణములు

భగవానుడు సర్వవ్యాపకుడు, సర్వ శక్తిమంతుడు. అరూపుడు, అనాముడు, సర్వగతుడు, నిర్లేపుడు, నిష్క్రియుడు. భగవంతుడు సర్వశక్తిమంతుడు కావున సగుణముగ నైన నిర్గుణముగనైన నుండగలడు యథార్థమునకు ఆయన సగుణ నిర్గుణాతీతుడు. విద్యుచ్ఛక్తివలన నేదైన బని జరుగ వలసియుండిన నది సగుణమై తీరవలెను. చీకటిని బోగొట్ట వలసివచ్చిన బల్బు ఉపాధిని ధరించి దీపమగును. చిన్న శబ్ద మును పెద్దదిగాఁ జేయఁదలఁచిన దూరశ్రవణ యంత్రాకారము [Myke]ను జెందవలయును. చెమటపోయుచుండిన నావిద్యు చ్ఛక్తియే గాలి పంకా [ Fan] ఆకారమును జెందవలయును. ఇట్లు పనినిబట్టి ఎన్నిరూపములనైనను జెందును. ఇనుమున కొక ఆకారము లేదు. గడ్డ విరువదలచిన గడ్డపలుగగును, గుడ్డ కుట్టదలచిన సూది యగును. మట్టి నావలకు విసరదలచిన పారయగును. పైరును గోయదలచిన కొడవలి లేక కత్తి యగును. కట్టెలను గొట్టదలచిన గొడ్డలి అగును. అట్లే బంగారమున కొక ఆకారము లేదు. చెవుల కలంకరింపదలచు కొనిన బోగులగును. మెడ నలంకరించిన కంటె, గొలుసు మొదలైనవగును. చేతి నలంకరింపదలచిన గడియమగును.

నడుము నలంకరింపదలచిన వడ్డాణమగును. 'సువర్ణ మేకం బహు భూషణాని' బంగారమొక్కటే గాని నానాభరణము లగును. అట్లే అగ్ని సర్వత్ర వ్యాపించియున్నది. ఎచ్చట ఘర్షణ మొనర్చిన నచ్చట వ్యక్తమగును. సర్వవ్యాపకముగ నగ్నిమీద బియ్యమును గడిగి పెట్టిన నన్న ముడుకదు. కాని అగ్నిని వ్యక్తము కావించి దానిపైన బియ్యమును గడిగిపెట్టిన నది అన్నమగును. దీనినిబట్టి భగవంతుని వలన నేదైన బని జరుగవలసి యుండిన సగుణమై తీరవలయును. భగవద్గీతలో భగవానుడే యిట్లు చెప్పెను. 'ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా' నాయొక్క ప్రకృతిని నే నాశ్రయించి నేను నా మాయచేఁ బుట్టినవాఁడ నగుచున్నాను.

భగవంతుని ప్రకృతు లెనిమిది యని గీతలో జెప్పబడినది.

శ్లో॥ భూమిరాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధి రేవ చ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥ ॥గీత॥

పృథివి, జలము. అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అను నీ యెనిమిది ప్రకృతులు నెనిమిది విధముల భిన్నములైనవి.

ఇందులో బంచభూతములు భగవంతున కాకారమును గల్పించునవి. మనస్సు, బుద్ధి, అహంకారము ఆయన చేయవలసిన క్రియలొనర్చునవి. ఆతడు సృష్టి యొనర్చుటకు ముందు ప్రతికల్పమునందును ఒక్కొక్క సగుణ సాకారరూపమును ధరించును.

శ్లో॥ ఆకాశస్యాధిపో విష్ణుః అగ్నేశ్చైవ మహేశ్వరీ
వాయోస్సూర్యః క్షితేరీశః జీవనస్య గణాధిపః ॥

ఆకాశము వలన విష్ణువును, అగ్నివలన మహేశ్వరియును వాయువు వలన సూర్యుడును, పృధివివలన నీశ్వరుడును, జలము వలన గణపతియు నైరి.

ఒక కల్పమున నిర్గుణ పరమాత్మ ఆకాశమును దుస్తు లుగా దీసికొనగా విష్ణువయ్యెను. ఆయనయే మహావిష్ణువు ఆకాశము నీలముగ నుండును. గావున నితడును నీలముగ నుండెను అష్టభుజములు. శంఖ చక్ర, గదా పద్మ, శార్ఙ్గ, నందక, కౌమోదక, అభయ హస్తములు ఈ విధముగ వ్యక్తము కాగానే వేదములు భగవంతునకు వందిమాగధులు కావున నాయనను గూర్చి స్తోత్ర మొనర్చినవి. అప్పుడు వైష్ణవమతి మేర్పడెను. ఆయన ప్రకృతులలో మనస్సు, బుద్ధి, అహం కారము లున్నవి. కావున నాయన మనస్సే బ్రహ్మ, ఆయన బుద్ధియే విష్ణువు, ఆయన అహంకారమే రుద్రుడు, మహావిష్ణు వధిష్టానముగ నుండి వీరి ముగ్గురిచే సృష్టి, స్థితి, లయముల నొనర్చెను.

మఱియొకకల్పమున భగవంతు డగ్ని నాశ్రయించెను. స్త్రీరూపము వచ్చెను. 'తామగ్ని వర్ణాంతపసా జ్వలంతీం వైరోచనీం కర్మ ఫలేషు జుష్టాం' అని దుర్గా మంత్ర పుష్ప మున గలదు. అగ్నిని దుస్తులుగాఁ దీసికొనుటచే జగదీశ్వరి

కాగా నామె అగ్నివలె ఎఱ్ఱగానుండెను. ఎఱ్ఱని చీరె, ఎఱ్ఱ రవిక, ఎఱ్ఱని పూలను ధరించి అంతయు నెఱ్ఱగా నుండెన వేదములన్నియును దేవియే సర్వలోకైక జననియు బరబ్రహ్మ స్వరూపిణి యనియు స్తుతించినవి. అప్పుడు శాక్తేయ మతమ కూడ ప్రచలితమైనది.

ఆ దేవి యొక్క మనస్సే బ్రహ్మ, బుద్ధియే విష్ణువు అహంకారమే రుద్రుడు. మీరు మువ్వురును నా బిడ్డలు నేను జెప్పిన చొప్పున సృష్టిస్థితి లయములను జేయుమనెను.

మఱియొక కల్పమున వాయుతత్త్వమును దీసికొని సూర్యుండయ్యెను. 'వాయోస్సూర్యః' అని కలదుకదా! అప్పుడు వేదములు సూర్యుడే సాక్షాత్పరంబ్రహ్మ యని స్తోత్రము లొనర్చినవి. ఆ సూర్యునియొక్క మనస్సే బ్రహ్మ. బుద్ధియే విష్ణువు, అహంకారమే రుద్రుడు. 'త్రిమూర్తిశ్చ దివాకరః' అని కలదుకదా! ఆతండే త్రిమూర్తులుగనయ్యెను. ఆ కల్పమున సౌరమతము వ్యాపించెను.

మఱియొక కల్పమున పృథివి నాశ్రయించి పరమ శివుండయ్యెను. 'క్షితేరీశః' అని కలదుకదా! అప్పుడు వేదములు శివునే పరబ్రహ్మగ స్తోత్రమొనర్చినవి. ఆ శివునియొక్క మనస్సు బ్రహ్మ, బుద్ధి, విష్ణువు, అహంకారము శివుండు. అప్పుడు శైవమతమును వ్యాపించినది.

ఇంకొక కల్పము వచ్చినది. ఆ కల్పములో భగవంతుడు జల ప్రకృతి నాశ్రయించెను. 'జీవనస్య గణాధిపః' అని కలదు

కదా! వేదము లన్నియును నా గణపతిని గూర్చి స్తోత్ర
మొనర్చినవి. గణపతియొక్క మనస్సు బ్రహ్మ, గణపతి యొక్క
బుద్ధి విష్ణువు, గణపతి యొక్క అహంకారము రుద్రుడు.
అప్పుడు గాణాపత్య మత మేర్పడినది. విష్ణువు, శక్తి, సూర్యుడు
శివుడు, గణపతి యీ యైదుగురును ఒక్కటే. కల్పభేదములను
బట్టి వేలువేలు ప్రకృతుల నాశ్రయించి వేలువేలా కృతులతో
నొక్కడే అభివ్యక్తమైనాడు. పురాణములలో నొక్కొక్క
చోటున నొక్కొక్క దేవతను నధికముగ జెప్పుటకు కారణము
కల్పభేదమును బట్టి వారి అభివ్యక్తము లందున్న తేడాయే.
వీరు వేలువేలు, ఒకరికంటె నొకరు గొప్పయని వాదించుట
అజ్ఞానము. వేదము "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అని చెప్పు
చుండగా వేరుగా నిద్దరును ముగ్గురును నున్నట్లు చెప్పుట
అజ్ఞానము కాదా? ఇద్దరు ముగ్గురున్నట్లు చెప్పిన వీరిని సృజిం
చిన వాడెవడను ప్రశ్నవచ్చును. అప్పకే ముగ్గురును నెగిరి
పోవుదురు. సమన్వయ మేమనగా భగవంతుడొక్కడే
యున్నాడు. అతడనేక నామముల తోడను. రూపముల
తోడను నభివ్యక్తముగు చున్నాడని తెలిసికొనవలెను. ఒకే
వ్యక్తిని కొడుకు 'నాన్నా' యనియు. మనుమడు 'తాతా'
యనియూ, బావమరది 'బావా' యనియు, అల్లుడు 'మామా'
యనియుఁ బిలుచును. వ్యక్తులిందఱు వేరు ఒక్కడే ఒకొ్క
క్కరిని ఒకొ్కక్క విధముగ వరుస యగుచున్నాడు. అట్లు
భావించి పరస్పర ద్వేషాసూయలు లేక వారివారి యిష్ట
దైవములను ననన్యముగ భావింపవలయును.

హిందూమతమున విగ్రహారాధనము చెడ్డదని **ఇ**తర మతస్థు లాక్షేపించు చుందురు. విగ్రహారాధన లేని మతము లేనే లేదు. + క్రాస్ విగ్రహము కాదా? ☾ అర్థచంద్రాకారము, చుక్క విగ్రహము కాదా? పార్శీలకు అగ్నిమూర్తి కాదా? మనమతమునఁ జెట్లను, పుట్టలను, పాములను. బక్షులను దేవునిగాఁ గొలుతుము. దేవుఁడొక్క గుడిలోనే యుండఁడు. గుడిలోను నుండును. సర్వవ్యాపకమైన తత్త్వమును అన్నిటిలోను జూచుట మనమత సిద్ధాంతము. మనము రాతిని బూజించెదమని కొందఱాక్షేపణ మొనర్చెదరు. అది రాయి యని మనకును దెలియును. కాని మనము దానిని రాయి అనుటను మఱచి దానిలోఁ జైతన్యమును దర్శించుచున్నాము. దానిని మంత్రపూత మొనర్చుచున్నాము. మనభక్తి వలననే సర్వ కార్యములను నెఱవేర్చుచు మనలను భగవంతుఁడు రక్షించుచున్నాఁడు.

భగవానుఁడు నిర్గుణుఁడయ్యును, సర్వకల్యాణగుణుఁడగుచున్నాఁడు. గుణములును నింద్రియాతీతములే (Abstract) సంతోషము అనునది గుణము. దానికి రూపములేదు. కాని సంతోషమనునది ఒక వ్యక్తిముఖమున వ్యక్తమగును. ఆ రూపము లేకుండిన సంతోష మను గుణము వ్యక్తము కాదు. అట్లే దుఃఖమనెడు గుణమును ముఖముమీఁద వ్యక్తము కావలసినదే. సర్వవ్యాపకుఁడగుటచే నీలముగ నున్నాఁడుఁ వ్యాపకమగు నాకాశమును, వాయువును నీలమే. అగ్నిలో.

దీప్తిమా గునది నీలముగనే యుండును. వెన్నెలలో మంటను గాంచుడు. విశాలమగు సముద్రములోని నీరును నీలముగ నున్నది. విశాలమగు కొండయును రాయి తెలుపు ఎఱుపుగ నుండినను నీలముగఁగనఁబడును. సర్వేశ్వరుఁడు కావున రత్న కిరీటము, సచ్చిదానందుఁడు కావున విశాలమగు ముఖమును, జిఱునవ్వును నుండును. బలమునకును బలమగువాడు కావున విశాలమగు వక్షస్థలమును, విశాలములగు నాజాను బాహువులును, కనకచేలమునుధరించుట' పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి' ఒక పావుభాగము విశ్వము నందలి సమస్త సృష్టి యును, సృష్టిలేనిది ముప్పాతిక భాగమును గలదు. ఆ కప్పిన ప్రకృతిని జెప్పుటకు కనక చేలము. ప్రభువు కావున భక్తులనురక్షించుటకు ధనుస్సు లేక చక్రము. ఇట్లాకార కల్పనమాయన గుణములనుబట్టిఅయినది. మనఅదృష్టమేమనిన మనదేవుఁడే మనకు తన్నెట్లు భజింపవలసినది చెప్పెను. కొందఱకు దేవుని కొడుకు చెప్పెను. కొందఱకు దేవుని దూత చెప్పెను.

**మానవుఁడననేల ?** సమస్త జీవరాసులును ఆనంద మును గోరును. ఆనందము విషయములలో లేదు. ఆత్మలోఁ గలదు, మనము అజ్ఞానముచే విషయములలో నుండియే ఆనందము వచ్చుచున్నదని అనుకొనుచున్నాము. విషయముల లోనే ఆనందముండిన నావిషయ మందఱకును నానందమీయ వలెను. ఒకరి కొక విషయములో నానందముండిన నింకొకరి

కింకొక విషయములో నానందముండును. ఒకవిషయము ననుభ వించిన సుఖము కలుగును. దానినే యింకకొంచె మెక్కువగ ననుభవించిన దుఃఖముగఁ బరిణమించును. ఇట్లుగాక ఎంతగా ననుభవించినను సుఖమట్లే యుండవలెను. చూడుఁడు.

సు + ఖం } ఈ రెంటిలో
దుః + ఖం } సమానముగనున్నది "ఖం"

'ఖం బ్రహ్మ' ఖం అనునది బ్రహ్మ పదార్థము. ఆకాశమను నర్థముకూడ కలదు. కాని యిచ్చట అనుభవరూపముగు బ్రహ్మ అని తెలియవలెను. ఈ యనుభవమును 'సు' మంచి విషయములతో ననుభవించిన దానిని "సుఖం" అందురు. ఆ యనుభవమును జెడ్డ విషయములతోఁ గలిపి యనుభవిం చిన దానిని "దుఃఖం" అందురు. అసలు భగవదనుభవము సుఖదుఃఖాతీతమైనది.

మన మనుభవించు వస్తువు అంతవంతముగ నుండరాదు. ఏదైన మనము సుఖము ననుభవించు పదార్థము శాశ్వతముగ నుండదు. అది శాశ్వతమై యుండవలెను. మనకు విషయ ములలోనుండి ఆనందము వచ్చునున్నదను భ్రమయే దుఃఖ మునకు గారణము. ఒక కుక్క ఒక ఎండు ఎముకను బట్టు కొని, దానిమీఁద నొయ్యారముగఁ బరుండి పటపట కొఱ కును. అట్లు కొరికిన దానిలో నేదో రసము వచ్చునని దాని భ్రమ, అది యెప్పుడో యెండి పోయినది. కొంచెము సేపు కొఱకగా కొఱకగా నాకుక్క నోటిలో చిగుళ్ళు తెగిన క్తము

ప్రవించి. ఆ ఎముక రక్తసిక్తమగును. పాపమా కుక్క-
తానింతవఱకు గొఱకుటచే నా ఎముకలో నుండి రక్తము
వచ్చుచుండినదని భ్రమించి దానిని నాకును. అదితియ్యగా
నుండును ఇంకను గొఱుకును. ఇట్లు తన రక్తమును నెముక
మీఁద ప్రవేశపెట్టుకొని, ఎముకనుండియే రక్తము వచ్చు
చుండినదని గాఁచెందనట్లు మానవుఁడు తనలోని
యానందమును తనకిష్టముండిన విషయములపై ప్రవేశపెట్టుకొని
దానిలో నుండియే ఆనందము కలుగుచున్నదని భ్రమించి
గాసినిఁజెందుచున్నాఁడు. మనకు తెరిగని వస్తువు; నిజమగు
నానంద పదార్థము ఆత్మయే. అదియే భగవంతుఁడు. సర్వ
వ్యాపకమై యున్నది. సర్వవ్యాపకమై యుండినను విగ్రహా
రాధనను చేయువలసినదే. మనకు దాహము వేసిన దను
కొనుఁడు. భూమి క్రింద సర్వత్ర దాహమును దీర్చు జలము
వ్యాపించి యున్నది. దానిని బొందుటెట్లు? ఆ జలమునకును,
మనకును నడ్డముండిన రాళ్ళను, యిసుకను, మట్టిని దీసివేయు
వలెను. మరల ప్రక్కనుండిన మట్టివిరిగిపడి అది పూడి
పోకుండునట్లు వరలో, రాతి కట్టడమో ఏదో కట్టవలయును.
ఇప్పుడు దానిలోనుండి తోడుకొని దాహమును దీర్చుకొన
వచ్చును. కేవలము జలము సర్వత్ర జలము వ్యాపించినదని
తెలియుట చేతనే దాహము తీరదు. అట్లే భగవంతుఁడు
సర్వవ్యాపకుఁడని తెలియుట చేతనే భవతాపము తీరదు.
దానిననుభవించుటకు అందుబాటులోనికి దెచ్చుటకు ప్రతి

బంధకములను దీసివేయవలెను. బాహ్య. కోనేరు మొదలగు వాని నేర్పరచుకొనుచున్నామో ఎంతజ్ఞానియైనను విగ్రహారాధనము గావింపవలసినదే! సర్వత్రవ్యాపించి యున్న సంగతియు దెలిసికొన వలయును. బావులుండు తావులు, ఆకారములు వేఱువేఱుగ నుండినను అన్నిటిలోని నీరు ఒక్కటేనని భావింపవలెను. ఎవరే రూపముతోడను, ఏ నామముతోడ నుండినను అన్నిటిలోని భగవచ్చైతన్య మొక్కటే. భగవచ్చైతన్య మంతటను నుండినను ఉపాసనకు వేద ప్రతిపాదితమైన నామరూపముల తోడనే ఉపాసించుట శ్రేయస్కరము. భగవంతుని అవతారములు పది కలవు. మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, బుద్ధ, కల్కి. ఇంకను నంశావతారములు కలవు మత్స్య, కూర్మ, వరాహ, వామన, పరశురామ, బుద్ధ, కల్కి యీ అవతారములలోఁ గొన్ని అంశావతారములు, కొన్ని యుగావతారములు, కొన్ని ఆవేశావతారములు. 'నృసింహ, రామ కృష్ణేషు షాడ్గుణ్యం పరిపూరితమ్, నృసింహ, రామ. కృష్ణావతారములలో షడ్గుణములు పరిపూర్ణములుగ నున్నవి. జయ విజయులు హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు, రావణకుంభకర్ణులు, శిశుపాల దంతవక్త్రులు వీరిని నిర్జించుటకై పూర్ణావతారులుగ రావలసి వచ్చినది. వీరు సాక్షాత్పరం బ్రహ్మలు అక్షరసాంఖ్యమును బట్టి చూడుఁడు.

బ్రహ్మ

కృత — రమా అచ్యుత

త్రేత — సీతా రామ

ద్వాపర – రాధికా కృష్ణ

కలి — వేంకటేశ (కలా వేంకట నాయకః)

బ్రహ్మ = బ23 + ర27 + హ 33 + మ 25 = 108

కృతయుగములో 'ఆత్మా వై ద్విధా౽కరోత్ అర్థేన స్త్రీ అర్థేన పురుషః

కృతలో ర 27 + మ 25 + ఆ2=54+అ1+చ6 + ఉ5 + య26+ త16=54 మొత్తము 108 అయినది.

త్రేతలో సీతా+రామ, స+32ఈ4 +త16+ఆ=2=54

ర27+ఆ2+మ25 = $\frac{54}{108}$ అయినది.

ద్వాపరలో రాధికా+కృష్ణ. ర27+ఆ2+ధ=19= ఇ3+క 1+ ఆ2=54

క1+ఋ7+ష31+ణ15 = $\frac{54}{108}$

'కలా వేంకట నాయకః' అనుటచే కలియుగమున వేంకటేశుడు, వ29+ఏ11+అం15+క1+ట11+ఏ11+శ30=108

108 పరబ్రహ్మతత్వమైనది. ఇచ్చట స్త్రీ దేవత అక్కఱలేదు. అన్నియు నాయనయే. బాలాజీ కదా. సర్వదేవతా స్వరూపుడు,

ఈ బ్రహ్మయే యీ ప్రపంచమైనది. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను శ్రుతి.

సంసార్వ=స32 + అం15 = స32 + ఆ=2 + ర27=108

మన శరీరమందు ప్రాణము 108 అంగుళములు కలిగి యున్నది. "అక్షేదం శరీరం షణ్ణవత్యంగుళాత్మకం భవతి" 'శరీరాత్ప్రాణః ద్వాదశాంగుళాధికో భవతి' ఈ శరీరము 96 అంగుళము లున్నది, (అంగుళమన బొటనవ్రేలియొక్క అడ్డకొలత) శరీరమునకంటెను ప్రాణము 12 అంగుళము లధికముగ నున్నది. 96+12=108 అయినది. మనము పగలు 108 వందలును, రాత్రి 108 వందలును శ్వాసించుచున్నాము. మొత్తము 21600 అయినది.

కలియుగము 108×4000 సం = 432000

ద్వాపరయుగము =108×800 =864000 సం॥

త్రేతాయుగము = 108×12000=1296000

కృతయుగము =108×16000=1728000

అనగా 108 40000 = 4320000

అంతయును 108 మీదనే ఆధారపడియున్నది.

పై విషయమునుబట్టి "ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం పూజయేత్" అనుటచే భగవంతుడు ప్రకృతిభేదములను బట్టి వేలువేలు కల్పములలో వేలువేలు రూపములలో నాకే భగవంతుడు అభివ్యక్తమును జెందు

చున్నాఁడు. పరస్పరము ద్వేషము లేక ఆయా నామ రూపములతో భగవంతుని భజించుకొనవచ్చును.

భగవంతుని భజించుటకు మార్గములు ముఖ్యముగ మూఁడు. కర్మ, భక్తి, జ్ఞానము. యోగమును భక్తి కంగముగ నొనర్చినారు. శరణాగతిని భక్తిలోఁ జేర్చినారు. కర్మ మార్గులకు గర్మ ప్రధానము. భక్తి జ్ఞానములంగములు, భక్తులకు కర్మ జ్ఞానము లంగములు. జ్ఞానులకు కర్మభక్తు లంగములు, గీతలో 'కర్మణైవహి సంసిద్ధిమాస్థితాజనకాదయః' జనకాదులు కర్మయోగము వలననే మోక్షమును బొందిరి. అని కర్మయోగము శ్రేష్ఠమని యిందుకలదు. 'భక్త్యామా మభిజానాతియావాన్ యశ్చాస్మి తత్త్వతః' 'భక్తి రేవగరీయసీ' అను వచనముల వలన భక్తియే గొప్పదని తోఁచుచున్నది. 'జ్ఞానే పరిసమాప్యతే' అనుటచేఁ గర్మలన్నియును జ్ఞానములోఁ బరిసమాప్తిని జెందుననుటచే కర్మ, భక్తి, జ్ఞానము దేనికవి గొప్పవిగాఁ జెప్పఁబడినవి. మూఁడును నవసరములే.

ఆకాశమున వెలుఁగు సూర్యుఁడద్దములోఁ బ్రతిబింబించినాఁడు. సరిగా నట్లేయున్నాఁడు. అద్దము నీలమైనసూర్యుఁడును నీలముగఁ గనఁబడును. అద్దము ఎఱ్ఱనిదైనచో సూర్యుఁడును నెఱ్ఱగఁ గనఁబడును. అద్దముమసక తెలుపు (మాలినసత్వము) గా నున్నచో సూర్యుఁడు మసకగాఁగనబడును. అద్దమెంత స్వచ్ఛముగ నుండిన సూర్యుఁడంత స్వచ్ఛముగ గనఁబడును. అట్లే హృదయము స్వచ్ఛముగ, గుణరహితముగ నుండినచో ఆత్మ

చైతన్య మంత స్వచ్ఛముగ నుండును. సత్త్వరజస్తమో గుణములతో నుండినఁ జైతన్య ప్రతిబింబమగు జీవుఁడును వదను సారముగ నుండును.

అద్దములోఁ బ్రతిబింబించిన సూర్యుఁడు ఒక చీఁకటి గదిలోనికిఁ దన వెలుగును వైచి, గదిలోని చీఁకటిని దానే పోఁగొట్టినట్లు అద్దమనుకొనునో, అహంకారముతోఁ గర్మ లొనర్చువాఁడు అంతయును దన వలననే యగుచున్నదని భావించును. కర్తృత్వమును వహించును. కర్తృత్వము వలననే పుణ్యపాపములును, బంధమోక్షములును, మానావమానములును, లాభాలాభములును, జయాపజయములను ద్వంద్వములు కలుగును. దీనివలన సుఖదుఃఖముల ననుభవించుచుండును. ఇట్టివానికి శాంతి లేదు.

నిరహంకారుఁడై భగవంతునుద్దేశించి, భగవత్ప్రీత్యర్థముగ, భగవదర్పణ బుద్ధితోఁ గర్మల నొనర్చిన బంధములంటవు. ద్వంద్వము లుండవు. కర్మలలో యజ్ఞములుముఖ్యము వలననఁగా మానవులకు దేవతలతోఁ బని యున్నది. వేడి కావలెను, గాలి వీవవలెను, వర్షము కురువవలెను. జీవశక్తి రావలెను. పంటలు పండవలయును. అసలు బీజములు కానలయును. వీని కన్నిటికి నధినాథుఁడున్నాఁడు. ఆతనిఁ దృప్తిఁ బొందింపవలెను. ఇన్ని జరుగనిది ప్రాణుల కాహారము లేదు. కావున దేవతలను మనము భజింపవలయును. వారి కాహారమును గల్పింపవలెను. అనఁగా హవిస్సుల నొసంగ

వలయును. మనకు నేడిమి అగ్నియొసంగును. మనము దేవతల కొసంగు హవిస్సుల నన్నిటిని అగ్ని వారివారి కందించును. అందువలన యజ్ఞములన్నింటిలోను ముందుగా 'అగ్నయేస్వాహా' అగ్నికి ఆహుతి నీయవలెను. వియ్యాలవారింటికి అరిసెల కావడిని మోసుకొనిపోవువానికి ముందుగా గడుపు నిండుగా నరిసెలను బెట్టవలెను. లేకుండిన దారిలో వాసెనను విప్పును. తర్వాత యజ్ఞభేదములను బట్టి ఆహుతులుండును. వర్షమును గురిపించు నింద్రునకు 'ఇంద్రాయస్వాహా' అనియు, ప్రాణశక్తి నిచ్చునట్టి సూర్యునకు "సూర్యాయస్వాహా" యనియు, పంటల నొసంగు చంద్రునకు 'సోమాయస్వాహా' అనియు, బీజముల నొసంగు ప్రజాపతులకు 'ప్రజాపతయేస్వాహా' యనియు బ్రహ్మకు 'బ్రహ్మణేస్వాహా' యనియు విష్ణువునకు 'విష్ణవేస్వాహా' యనియు నిట్లు వివిధ దేవతలకు శాస్త్రప్రకారము ఆహుతులీయవలయును. వారు గీర్వాణులు కావున వేదమంత్రములతో గీర్వాణభాషలో నీయవలయును.

దేవతల కాహారము అమృతము. వా రమృతాశనులు. ఎవరే యాహారమును గైకొనెదరో వారికా యాహారమును బెట్టవలెను. గోవు అమృతములోనుండి పుట్టినది,

## గోవు

భగవంతుని నాభినుండి బ్రహ్మపుట్టెను. ఆయనకు దన పుట్టుక యెట్లు వచ్చినదో తెలియకుండెను. ఇంతలో 'త, ప'

అను రెండక్షరములు వినఁబడినవి. అప్పుడు బ్రహ్మ తపస్సు చేయఁగా భగవంతుఁడు ప్రత్యక్షమై సృష్టియొనర్పు మనెను ఆయన ఒక్కని వలన గాక తనకు తోడుగ నవ బ్రహ్మలను సృజించుకొనెను. వారిని సృష్టి చేయుమని కోరఁగాఁ గొందఱు పక్షులను, కొందఱు మృగములను గొందఱు పాములను ఇట్లు వివిధ సృష్టినొనర్పఁ బ్రారంభించిరి. కాని యీ నవబ్రహ్మ లలో దక్షప్రజాపతి అన్నిటి కంటె నుత్తమ జాతియగు మానవులను సృజించెను. మిగిలిన జంతువులన్నియును నడ్డముగ నడుచును. మానవులను నిలువబెట్టినాఁడు. అనఁగా శిరమున గల బుద్ధికిని భగవంతునకును నింకేమియును నడ్డము లేదు. అనఁగా భగవంతునిఁ గనుఁగొనుటకు మాత్రమే మానవుని సృజించెను. మానవ జన్మము వచ్చినను బశువులవలె నాహార, నిద్ర, భయ, మైథునములలో మునిఁగి యుండిన నాతని నర పశువన వలయును. ఇట్టినరునిఁదమలోఁ జేర్చుటచేఁ బశువుల కును గోపమువచ్చినది. తులసీదాసగోస్వామి యిట్లనెను: యే నరపశుబిను పూంఛ విషాణా' ఈ నరపశువులకు పశులకు స్వాభావిక అలంకారములగు కొమ్ములు, తోక లేదు.

అట్టి ఉత్తమ మానవజాతిని మనస్సంకల్పముచే సృజిం చెను. వారందఱును ఆఁకలి, ఆఁకలి యని దక్షునిచుట్టును మూగిరి. వారి యాకలిని దీర్చునుపాయము వారికి తోఁచలేదు. వెంటనే తనను సృష్టిచేయుమనిన బ్రహ్మకడకు బోయెను. బ్రహ్మయును తోఁచక తనకడ గల అమృతమును బ్రావు

మనెను. అమృతము తేనెవలె మెత్తగను, మధురముగను, సౌరభముతోను నుండును. దానిని దక్షుఁడు త్రాగెను. త్రాగఁగానే త్రేపువచ్చెను ఆ త్రేపులో నా సౌరభము బయటకు వచ్చెను. ఆ సౌరభములో నుండి ఒక జంతువు పుట్టెను. దాని కైదు చన్నులు కలవు. నాలుగు కొమ్ములు కలవు. నాల్గుపాదములును, నాల్గు భుజములును గలవు. అది ధర్మార్థకామ మోక్షముల నొసంగును. దానిని సౌరభము నుండి పుట్టుటచే సురభి అన్నారు. ప్రదక్షిణ శ్లోకమిది—

శ్లో॥ పంచ స్తనీం చతుశ్శృంగీ చతుష్పాదాం చతుర్భుజాం
చతుర్వర్గ ఫలాందాయీం భావితాం సురభిం భజే॥

అర్థము పైనఁ జెప్పఁబడినది.

ఇది సృజింపఁబడగానే అన్వారిగాఁ బాలను గుఱిపించెను. సృజింపఁబడిన మానవు లా పాలను ద్రావి అమరులైరి. వారందఱును నారదునిచే జ్ఞానోపదేశమును బొంది అడవులకును, గొండగుహలకును బోయిరి. అప్పుడు దక్షుఁడు నారదునిట్లు శపించెను : "నా పుత్రులకు ఇల్లు వాకిఁలి లేకుండ చేసినావు కావున నీకును నిల్లు వాఁకిలి లేకబోవుగాక ! వారడవులదిరుగునట్లు నీవును నంతటను దిరుగుదువుగాక !

సంకల్ప సృష్టివలనఁ జిక్కులు రాఁగా నప్పుడు భగవదాదేశమున మిథునసృష్టి ప్రారంభమయ్యెను. 'అత్మావై ద్విధాఽకరోత్, అర్థేన స్త్రీ అర్థేన పురుషః' భగవానుఁడు తాను రెండుగా నయ్యెను సగము స్త్రీగను, సగము పురుషుఁడు

గను నయ్యెను. సురభి స్త్రీ కాదు, పురుషుఁడును గాదుఁ అదియు రెండయ్యెను. ఒకటి గోవు, ఒకటి ఎద్దు. అసలీ గోజాతి మానవ పోషణకై సృజింపఁబడినది. కావున గోవు పాలు, పెరుగు, నేయి మొదలగు రసములచేతను, ఎద్దు నేలను దున్ని పంటలను బండించియును మానవపోషణ చేయుచున్నది. అందువలన గోవు మనకు దల్లి. ఇంతకు దేవతల కాహార మమృతముగాన అమృతమునుండి బుట్టిన గోరసములన్నియును నమృతములే కావున మనకు సర్వవిధముల సహాయమొనర్చు దేవతలకు మనము గోరసములతో నాహారమును గల్పింప వలయును. అందువలననే యజ్ఞములలో ఆవుపాలు, ఆవు పెరుగు, ఆవునేయి విని యోగింపఁబడుచున్నది. వీనినగ్ని ద్వారా దేవతలకుఁ బంపించుటకు గీర్వాణభాషలోఁగల వేదమంత్రము లతోఁ బంపింపవలయును. దానికి వేదాధ్యయన మొనర్చిన శ్రోత్రియబ్రాహ్మణులు కావలసివచ్చినది. ఈ గోవులును, బ్రాహ్మణులును లేకుండిన దేవతలతో సంబంధ మేర్పడదు. పైన దేవతలు – వేదములు. భూమిపై గోవులు— బ్రాహ్మణులు ఇది ఒక జాతిపరముగఁ జెప్పుటకాదు. యథార్థము. అందు వలననే 'గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యమ్' గోవు బ్రాహ్మణుడు నిత్యము శుభముగ నుండవలెను. సమస్త ప్రజలకు గోవు శరీరపోషణ మొనర్చును. బ్రాహ్మణుఁ డాత్మ పోషణ మొనర్చును. ఇచ్చట చెప్పఁబడిన బ్రాహ్మణుఁడు వేదమునధ్యయన మొనర్చి, సదాచారసంపన్నుడగు బ్రహ్మణ్య మూర్తియగు వానిని గూర్చియే.

కర్మమార్గములో యజ్ఞములొనర్చిన సర్వమానవకోటికి క్షేమము కలుగును. వర్షములు కురిసి సమస్త జంతువులకును జలము నొసంగును, పంటలు, ఓషధులు మిక్కిలిగ పండుటచే సుభిక్షముగ నుండును. కావున యజ్ఞము చేయుట సర్వమానవ కోటి క్షేమము కొఱకే.

కొన్ని యజ్ఞములలో జంతుబలి నిచ్చెదరు. అసలు నిజముగఁ గామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర, అసూయా దంభ, ద్వేషములను బలియీయవలెను. ఇది ఆత్మయజ్ఞము.

సాధారణముగా బ్రాహ్మణు లహింసాపరులు, వీరు హింసచేయరు. కలుపు మొక్కనైనఁ బీకరు. అట్టివారు యజ్ఞములలో నల్లమేకను ఖండించి దాని వపను హోమము చేయుటేమిటి? శంకించి పాశ్చాత్యులు కొందఱు శాస్త్రీయ ముగా (Scientific) గా బరీక్షించిరి. ఆకాశమున 49 వాయు వులు కలవు. ఇందులో నొకానొక వాయువు మేఘములన్నియు నొకచోటఁ జేరినపుడు వాటినిఁ జెదరుగొట్టి వర్షము లేకుండ జేయును. హిందువులు యజ్ఞముల వలన వర్షము కురియు నందురే, ఎట్లు కురియునని మేకయొక్క వపను, పట్టుగుడ్డను, మంచి గంధపుచెక్కను, కర్పూరమును, ఇంకను సుగంధ ద్రవ్యములను, ఆవు నేతిని వ్రేల్చుటచే వెలువడిన వాయు వును ఒక ఖాళీబెలూనులోనికిఁ బట్టి ఆ వాయువును ఆకాశ మునకు విమానము మీఁద పోయి వదలిరి. ఈ వాయువు

వలనఁ జెదరిపోయిన మేఘములు మరల నొక చోటునకుజేరి వర్షించెను.

యజ్ఞములును లేవు. సకాల వర్షములును లేవు. శాస్త్రీయముగ యజ్ఞ మొనర్చిన నాకర్త స్వర్గమును బొందును ఆ పుణ్యమైపోయిన తర్వాత, "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి" అను గీతావాక్యమునుబట్టి మరల జన్మింపవలసినదే. అట్లుగాక జ్ఞానభావముతో 'బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం, బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా' అన్నిటిని బ్రహ్మభావనతో వేల్చి, బ్రహ్మార్పణ మొనర్చిన మోక్షమునకుఁ బోవును. ఇట్లు చేసిన బ్రహ్మవిస్మృతి కలుగదు. ఈ హోమధూమమును వాసన చూచినను నాయుర్వృద్ధియే.

శ్లో॥ వృద్ధార్కః హోమధూమశ్చ బాలస్త్రీ నిర్మలోదకమ్
రాత్రౌ క్షీరాన్న భక్తిశ్చ ఆయుర్వృద్ధి ర్దినేదినే॥

సాయం సూర్యుని యెండలో నాతపస్నాన మొనర్చుటయు, హోమధూమమును వాసన జూచుటయును, తనకంటె వయస్సు తక్కువ దానితో సంభోగ మొనర్చుటయును, నిర్మలమగు జలమును ద్రావుటయును, రాత్రియందు పాల యన్నమును దినుటయును రోజురోజునకు నాయుస్సును బెంచును.

శ్లో॥ బాలార్కః ప్రేత ధూమశ్చ వృద్ధస్త్రీ పల్వలోదకమ్
రాత్రే దధ్యన్న భుక్తిశ్చ ఆయుఃక్షీణే దినే దినే॥

ప్రొద్దుటి ఎండలో నుండుటయును, పీనుఁగు కంపును అనఁగాఁ కమురు కంపును వాసన చూచుటయును, తనకంటె వయస్సులోఁ బెద్దదగు స్త్రీతో సంభోగించినను, ఆవులలములతో నుండిన మురికినీటిని ద్రావినను, రాత్రియందు పెరుగన్నమును దినినను రోజురోజునకు నాయువు క్షీణించును. కర్మలందు కర్తృత్వముండునని ఇదివఱకే చెప్పితిమి. అద్దములోఁ బ్రతిబింబించిన సూర్యుఁడు తన వెలుఁగు నొక చీఁకటి గదిలో వైచి అది తనవలననే చీఁకటి పోయినదని భావించును ఇదియే కర్తృత్వము. కొంతసేపటికి ఇది తన వెలుఁగు కాదని తెలిసికొని, తనకెక్కడనుండి వెలుఁగు వచ్చినదా యని క్రమముగా సూర్యునివైపునకు బ్రయాణించును. ఇదియే భక్తి మార్గము. చివరకు సూర్యుని యొక్క కిరణస్తంభమును, అద్దములోని ప్రతిబింబ సూర్యుని యొక్క కిరణస్తంభములును నొక్కటి యగును. ఇదియే భక్తిలో నైక్యత. ఇట్లు సూటి కిరణముల వలన అద్దము యొక్క కళాయి కఱఁగి నశింపఁగా నా ప్రతిబింబము బింబములోఁ గలిసిపోవును. అనఁగా భక్తి పరాకాష్ఠస్థితినిఁ జెందఁగా నంతఃకరణమను గళాయినశించును. అంతఃకరణము నశింపఁగా నిఁక మిగులునది ఆత్మయే. ఇదియే జ్ఞానము. భక్తేస్తు యా పరాకాష్ఠా సైవ జ్ఞానం ప్రచక్ష్యతే' భక్తియొక్క పరాకాష్ఠస్థితికే జ్ఞానమని పేరు. భక్తి వలన భవతాపము తీఱును. జ్ఞాన మనుభవ రూపమైనది. అన్నమును దినినఁ గడుపులోని తాపము తీఱును. నిద్రకన్నులతోఁ

దినను నాఁకలి తీరును. కాని రుచి తెలియక పోవచ్చును. భక్తి యెట్లుచేసినను ముక్తికలుగును. జ్ఞానమున నెఱుక యుండవలయును భగవద్రామానుజులును, శంకరభగవత్పాదుల వారును భక్తిజ్ఞానముల కొక్కటే ఉపమానమును జెప్పిరి. సముద్రమునకుఁ దరంగమునకును బోల్చిరి. సముద్రము తరంగములగును. కాని తరంగము సముద్రమెట్లు కాఁగలదు? తరంగము సముద్రము నాశ్రయించుకొని యుండవలయును. లేకుండిన నది లేకుండపోవును. అట్లే జీవుఁడు తప్పక యెల్లప్పుడును భగవంతుని ఆశ్రయించుకొని యుండవలయును.

శ్రీ శంకరభగవత్పాదులును నదే ఉపమానమును జ్ఞాన మార్గమును బోధించుచు 'జీవో బ్రహ్మైవ నా పరః' జీవుఁడు బ్రహ్మ తప్ప వేఱుకాదు. సముద్రమందలి నీరును ద్రవమే, తరంగమందలి నీరును ద్రవమే. సముద్రజలము నుప్పగా నున్నది. తరంగమందలి జలమును నుప్పనయే. సముద్రజలమును తెలుపే. తరంగమందలి జలమును దెలుపే. ఇంకఁ దాత్త్వికముగ నారెంటికిని భేదమేమున్నది? బ్రహ్మము నందలి సత్, చిత్, ఆనందమున్నది. జీవుని యందును సత్, చిత్, ఆనందములు కలవు, కావునఁ దాత్త్వికముగ రెండు నొక్కటియే. కర్మ, భక్తి, జ్ఞానము లవినాభావ సంబంధము కలవి. అందులో భక్తి సులభము. 'భక్తి వశః పురుషః' 'భక్తిరేవైనం గమయతి' యను శ్రుతివాక్యములు భక్తి ప్రాధాన్యమును జెప్పును.

అద్వైతులకును, ద్వైతులకును, విశిష్టాద్వైతులకును. అనుష్ఠానమార్గమొక్కటియే. మూఁడు మతములందును భక్తి కలదు. "అద్వైతం పరమార్థతః.' అద్వైతము పరమార్థమందే ఆచరణానుష్ఠాన మందందఱును భక్తినే అవలంబించెదరు. అవలంబించవలయును.

హిందూమత మందలి ప్రతిశాఖలోను భక్తి కలదు. అద్వైతులు, ద్వైతులు, విశిష్టాద్వైతులు, శైవులు, సౌరులు శాక్తేయులు, గాణాపత్యులు, లింగాయతులు, కాపాలికులు, ఆర్యసమాజ, బ్రహ్మసమాజ, సిక్కు మొదలగు వారందఱును హిందూమతమందలి శాఖలే. వీరందఱును భక్తి ననుసరించు వారే,

## భక్తి

భక్తి ప్రధానమైనదని యిదివఱకే చెప్పియుంటిమి. భక్తి యనఁగాఁ బ్రేమ యనియుఁ జెప్పియుంటిమి. భక్తి రెండువిధములు 1. సాధన భక్తి 2. సాధ్యభక్తి. సాధనభక్తి యును దొమ్మిది విధములు. 1. శ్రవణము 2. కీర్తనము 3. స్మరణము 4. పాదసేవనము 5. అర్చనము 6. వందనము 7. దాస్యము 8. సఖ్యము 9. ఆత్మనివేదనము. సాధ్యభక్తికి ప్రేమభక్తి యనియు, రసాత్మికభక్తియనియును పేరు కలదు. ఇది యైదు విధములు. 1. శాంతము 2. దాస్యము. 3. వాత్సల్యము 4. సఖ్యము 5. మధురము.

సాధనభక్తినిఁ జేయుటచే భక్తిలేనివానికిని భక్తి కలుగును. ముందు శ్రవణమును శ్రద్ధతోఁ జేయవలయును. ఇట్లు భగవద్గుణములను శ్రవణము చేయఁ ఆతని గూర్చి కీర్తించుట జరుగును. కీర్తనము నాల్గు విధములు. 1. గుణసంకీర్తనము 2. లీలా సంకీర్తనము 3 భావసంకీర్తనము 4. నామసంకీర్తనము. ఇందులో నొకదాని కంటె మఱియొకటి శ్రేష్ఠమైనది అన్నిటికంటె నామ సంకీర్తనము శ్రేష్ఠమైనది. ఒక్కఁడుగా జేయునది. కీర్తనము. 'సామూహికేన సంకీర్తనమ్' సమూహికముగాఁగలిసి చేయునది సంకీర్తనము.

సంకీర్తనము చేయఁగా స్మరణములోనికిఁ బోవును ఇది మనస్సుతోఁ జేయునది. ఈ స్మరణము మూఁడు విధములు. 1. నామస్మరణము. 2. రూపస్మరణము 3. స్వరూపస్మరణము జపమాలతోడనో, శ్వాసమీఁదనో, నడుచుచునో చేయు జపము నామస్మరణము. రూపమును హృదయమున స్థాపించుకొని చేయుధ్యానమును, నడుచునప్పుడు తన యిష్ట దేవత ముందు పోవుచున్నట్లు భావన చేయుచుండిన రూపస్మరణమగును. తానాత్మ స్వరూపుఁడ ననియు, అది పరమాత్మ అంశమేననియును భావించుటకు స్వరూపస్మరణమని పేరు.

పాదసేవనము :- భగవంతుని పాదములను సేవించుట పాద సేవనము. ఇది అవతారకాలములోనే సంభవమగును. 'తస్మిన్ తజ్జనే భేదాఽభావాత్' ఆతనికిని ఆతని భక్తులకును భేదములేదు, 'సాధుల హృదయము నాయది, సాధుల హృద

యుంబు నేను' అని భగవంతుఁడే చెప్పినాఁడు. పైఁగా భగవంతుని కంటె భగవద్భక్తులే శ్రేష్ఠులు. భగవంతునిలో భగవంతుఁడొక్కఁడే యున్నాఁడు. భగవద్భక్తులలో భగవంతుఁడును భగవంతుని వశపఱచుకొనిన భక్తుఁడును గలఁడు

శ్లో॥ సిద్ధిర్భవతి వా నేతి సంశయోచ్యుత సేవినామ్
న సంశయోఽత్ర తద్భక్త పరిచర్యా రతాత్మనామ్ ॥

భగవంతుని సేవించినవానికి సిద్ధి కలుగునో. కలుగదో అనుమానమే. ఆతని భక్తులను సేవించువారలకు సిద్ధి కలుగుటలో సంశయము లేదు.

అర్చనము :- తరువాత భక్తి, భగవదర్చనము, విగ్రహము, సాలగ్రామము, కుడ్యము, స్థండిలము, యంత్రము, కలశము పటము మొదలగువానియందు భగవద్భావన మొనర్చి షోడశోపచారములతోఁ బూజించుటకు అర్చనమని పేరు.

వందనము :- భగవంతునకును, భగవన్మూర్తి మొదలగు వానికిని, భగవద్భక్త భాగవతులకును వంగి నమస్కరింప వలయును. రెండు చేతులను జోడించి హృదయముదగ్గఱఁ బెట్టుకొని తలను వంచి నమస్కరింపవలయును. ఒంటిచేతి నమస్కారము పనికిరాదు. వంటిచేతి నమస్కార మొనర్చిన రెండవచేతికి పక్షవాతము వచ్చును. రెండవచేయి యుండఁగా దానిని వినియోగింపక పోయిన నది యింకెందులకని భగవంతుఁడు దానిని లేకుండఁ జేయును ఇది సాధారణ నమస్కారము

పంచాంగ నమస్కారము దీనికంటె శ్రేష్ఠము. మోకాళ్ళ మీఁదఁ గూర్చుండి తలను నేలకు మోపి రెండు చేతులతో నమస్కరించుట పంచాంగ నమస్కారము.

సాష్టాంగ నమస్కారము దీని కంటె శ్రేష్ఠము.

కం॥ కరయుగములు చరణంబులు
ఉరము లలాటస్థలంబు నున్నత భుజముల్
సరి ధరణి మోపి మ్రొక్కినఁ
బరువడి సాష్టాంగ మండ్రు పరమ మునీంద్రుల్ ॥

దాస్యము:- భగవదవతారముండిన భగవంతునకు దాస్యమును స్వయముగఁ జేయవచ్చును. లేకుండిన భగవత్కైంకర్యములను జేయుచుండవలయును. గుడులు కట్టించుట, సత్రములు వేయించుట, స్వామికి పూలతోటలు పెంచుట, పూలమాలలు కట్టుట, స్వామికి సంబంధించిన సమస్త సేవలొనర్చుచుండవలెను భగవంతుని యందు శ్రద్ధా విశ్వాసము లుండవలయును.

సఖ్యము - గవంతుని తోడను, భగవద్భక్తుల తోడను, సఖ్యమొనర్చుట సఖ్యభక్తి యందురు. సజ్జన సాంగత్యము వలన ముక్తి కలుగుటలో సందేహము లేదు. శ్రీ శంకరు లిట్లనిరి:- 'త్రిజగతి సజ్జన సంగతి రేకా - భవతి భవార్ణవ తరణే నౌకా' ముల్లోకములందును సజ్జన సాంగత్య మొక్కటియే సంసారసముద్రమును దాటించు నౌక యగును. ఒక సజ్జనుఁడు తనవాఁడని యనుకొనిన నాతఁడే గతికిఁబోవునో యాతఁడును నాగతికే పోవును.

ఆత్మనివేదనము:- ఆత్మనివేదనమనిన శరణాగతి. మనభార మంతటిని భగవంతునిపై వైచుటకు ఆత్మనివేదనమని పేరు. శరణాగతుండైనవాఁడు భారమంతయును భగవంతునిపై వేసినాఁడు కావున నిర్భరుఁడై, నిర్భయుఁడై యుండును. ఈతనిని భాగవతుఁడందురు. భక్తునకును భాగవతునకును గొంచెమే భేదము కలదు. భక్తుఁడు మర్కటకిశోరన్యాయముగ నుండును కోఁతి. కోఁతి పిల్లవలె నుండును. కోఁతి చెట్లమీఁద నివసించును. పిల్ల క్రిందనుండిన దానికి పాలెట్లు లభించును? అందువలన నది తన తల్లిపొట్టను గట్టిగాఁబట్టుకొని యుండును. కోఁతికి బరువగుటచే నొక్కొక్కప్పుడు దానిని వదిలించుకొనుటకుఁ బీఁకును. కాని పిల పట్టు వదలదు. ఆలాగుననే భక్తుడు భగవంతుని అంటిపెట్టుకొని యుండును. భగవంతుఁడు పరీక్ష చేయుటకై తనకు దూరముగాఁ జేయుటకుఁ బ్రయత్నించును. కాని భక్తుఁడు భగవంతుని వదలఁడు. ఇంక భాగవతుఁడు మార్జారకిశోరన్యాయమున నుండును. పిల్లియొక్క కోరలతి పదును గలవి. దానిమీఁద నతి మృదువుగ నుండు పిల్లికూనను గఱచుకొని యేడిండ్లు త్రిప్పును. కాని యా పిల్ల కుఁయ్ కఁయ్ అనదు. ఇచ్చట తల్లి పట్టేకాని పిల్లపట్టు లేదు. ఆ పిల్లయొక్క రక్షణభారమంతయును దల్లి మీఁదనే కలదు. అట్లే ప్రపన్నుని రక్షణ భారమంతయును భగవంతుని మీఁదనే కలదు.

శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే
అభయం సర్వభూతేభ్యః దదామ్యేతద్వ్రతం మమ॥

ఒకానొకప్పుడైన నను శరణమంతయును నామీఁదనైచి నేను నీవాఁడనని యాచించిన సర్వభూతములకును నేను అభయ మొసంగెదను. ఇది నా వ్రతము.

శ్లో॥ సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యం మోక్షయిష్యామి మాశుచః॥

సమస్త ధర్మము లను వదలి నన్నొక్కనినే శరణు వేఁడుము. నేను సర్వపాపముల నుండియు నీకు విముక్తినిఁ గలుగఁ జేయు దును నీవు భయపడకుము.

ఇట్లు శ్రీరామావతారమందును, కృష్ణావతారమందును భగవంతుఁడు ప్రపన్నులను రక్షించెదనని ప్రతిన జేసి యున్నాఁడు.

పైన జెప్పిన నవవిధ భక్తులలో శ్రవణ భక్తి వలన పరీక్షిత్తును, కీర్తనభక్తివలన శుకుఁడును, స్మరణ భక్తివలనఁ బ్రహ్లాదుఁడును, పాదసేవన భక్తివలన లక్ష్మియును, అర్చన భక్తివలన పృథుచక్రవర్తియును, వందనభక్తివలన నక్రూరుఁ డును, దాస్యభక్తిచే హనుమదాదులును. సఖ్యభక్తి వలన నర్జునుఁడును, ఆత్మనివేదన భక్తి వలన బలిచక్రవర్తియును తరించిరి.

ఇవిగాక భక్తిలో రసాత్మక భక్తికలదు. ఇది సాధన భక్తికంటె శ్రేష్ఠమైనది. ఇవి అయిదు రసములు. 1. శాంత 2. దాస్య 3. వాత్సల్య. 4 సఖ్య 5. మధుర భక్తులు.

శాంత రసములోఁ బ్రేమమాత్రము కలదు. ఈ భక్తిని మహా ర్షులు అవలంబించిరి. ఇందులోఁ బ్రేమ కలదుగాని సాన్నిధ్యము లేదు. ప్రేమ, సాన్నిధ్యము రెండునుండిన మేలుకదా! ఇది దాస్యభక్తి, దీనిని హనుమదాదులాచరించిరి. కాని యిందు భగవంతుని వద్ద భయమేకాని చనువులేదు. ప్రేమ, సాన్ని ధ్యము,చనువుగల భక్తి వాత్సల్యభక్తి. దీనిని యశోదాదులు చేసిరి, ఇందును నొక లోపము కలదు. ప్రేమ, సాన్నిధ్యము. చనువు కలదుగాని మనమెంతగాఁ బ్రేమించెదమో అంతటి ప్రేమ అచ్చటినుండియును రావలయును. ఇట్లు చేసినవారు గోపబాలకులు.

సఖ్యభక్తి, దీనిలోను నొక లోటు కలదు. ప్రేమ, సాన్నిధ్యము, చనువు, పరస్పర ప్రేమ కలదుగాని ఒక్కటే యగుట లేదు. అది మధురభక్తిలోఁ బర్యవసించినది. రాధ, గోపికలు ఈ భక్తి నాశ్రయించిరి ఇందు ప్రేమ, సాన్ని ధ్యము, చనువు, పరస్పర ప్రేమ, ఐక్యభక్తి కలదు.

భక్తిలో సర్వమును వాసుదేవమయముగఁ జూచుట పర్యవసానము. క్రమముగ జ్ఞానము నభ్యసించవలయును. ఒక పదార్థమును దినుట భక్తి వంటిది. దాని రుచిని గ్రహించుట వంటిది జ్ఞానము. జ్ఞానమందును. తత్త్వజ్ఞానము, అనుభవ జ్ఞానమని రెండు విధములుగఁ గలదు. మన శరీరములో బంచ భూతములు, వాని గుణములగు శబ్ద,స్పర్శ, రూప,రస, గంధ ములను తన్మాత్రలు, వాక్కు,పాణి. పాద, పాయు, ఉపస్థలను

కర్మేంద్రియములైదును, శ్రవణము, చర్మము, కన్ను, నాలుక, ముక్కు ఇవి జ్ఞానేంద్రియములు. ఈ యిరువది జడతత్త్వములు. ఆత్మ చైతన్యతత్త్వము, ఈ రెంటిని గలుపునది అంతఃకరణము. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము. ఈనాల్గింటికి మనస్సు రాజు. ఇది ఆ యిరవది జడతత్త్వములతోఁ గలిసిన నాతఁడు జడుఁడనఁబడును. ఆత్మతోఁ గలిసిన నాత్మలో లీనమగును. అందువలననే 'మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' అని చెప్పఁబడినది. ఇరువది యైదవవాఁడు జీవుఁడు. 'పంచవింశోఽయం పురుషః' అని శాస్త్రము కదా. జీవుని కావల ప్రకృతి, ప్రకృతికావల పరమాత్మకలఁడు ఈ యిరువదేడు తత్త్వములను దెలిసికొనవలయును. ఆ యిరువదేడవ తత్త్వమే పరమాత్మ. అదియే నేను. 'అహం బ్రహ్మాస్మి' అని దానినే అనుసంధానమొనర్పవలయును. ఆ 'నేను' సర్వజీవులందును గలదు. అందఱిలోని 'నేను' ఒక్కటే. అది నిత్యైక వచనము. ప్రథమ పురుషలో అతఁడు+అతఁడు=వారు. అట్లే ఆమె+ఆమె=వారు. అది+అది=అవి. ఇందు బహువచనము వచ్చినది. ఇఁక మధ్యమ పురుషలో నీవు+నీవు=మీరు అను బహువచనము వచ్చినది. నేను+నేను=నేనే నేను అనుదానికి బహువచనము రాలేదు. కావున నందఱిలోఁగల నేను ఒక్కటే. సాధారణముగ నేనుకు 'మేము' మనము అని చెప్పు బహువచనము తప్పు. నేను+అతఁడు=మేము. నేను+నీవు=మనము

అట్టి సమయములో మేము మనము నేను అనుదానికి బహు వచన మెట్లుకాఁగలదు? తన్నుఁదాను జూచుకొనినఁ బాహ్య ప్రపంచమంతయు గనఁబడకుండఁ బోవును. మిథ్యయగును. ఆత్మయే బ్రహ్మ, అది సర్వత్రయున్నది. నేను లేనిదింకే వస్తువు కలదు. నేనుజూచే వస్తువులో ముందుగా నేను ప్రవేశించి దానిని గుర్తించుట జరుగుచున్నది. తన్నుతాను జూచుకొన్న ప్పుడు మనస్సు నాశనమగుచున్నది. అదియే నిర్వికల్ప సమాధి మరల బయటకు వచ్చినపుడు కనఁబడున దంతయును దానేయని భావింపవలెను, 'సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని, ఈక్షతే యోగ యుక్తాత్మా' సర్వమును దన యందును, అన్నిటిలోఁ దాను నుండినట్లు యోగయుక్తుఁడగు వాఁడు చూచుకొనవలయును. అట్టివాని కేపనిని జేయుచుండినను సమాధియే. ఈ యనుభవమును సంపాదించిన వానికిఁక జన్మముండదు. జీవన్ముక్త స్థితిని సంపాదించు విధానము మన హిందూమతములో దప్ప యింకే మతమందును లేదు. ఈ లోకములో నుండగానే ముక్తి లభించుట దుర్లభము. దానికి మనము సాధన చేయవలయును.

సాధన శరీరము, ఇంద్రియములు, మనస్సు (అంతఃకరణము) వీనిలో దోషములు రాకుండునట్లు చూచుకొనవలయును. శరీరమును నారోగ్యముగ నుంచుకొనవలయును. శరీరమెంత ఆరోగ్యముగ నుండిన మనస్సంత ఆరోగ్యముగ నుండును. శరీరారోగ్యమునకు ఆయుర్వేద మిట్లు చెప్పుచున్నది

శ్లో॥ నిశాంతే చ పిబేద్వారి దినాంతే చ పిబేత్పయః
భోజనాంతే పిబేత్తక్రం వైద్యేన కిం ప్రయోజనమ్ ॥

తెల్లవారుజామునఁ జల్లని నీరును త్రాగవలయును. రాత్రియందు పాలను త్రాగవలయును. భోజనమైన తర్వాత మజ్జిగను త్రాగవలయును. ఇట్లు చేసినచో వైద్యునితోఁ బనిలేదు.

ఉదయముననే మనవంటి ఉష్ణదేశస్థులకు వేడివేడి కాఫీ, టీ, కోకో మొదలగు పానీయము లవసరములేదు. అవి పాలలోని, పంచదారలోని గుణములనుగూడ చెడగొట్టుచున్నవి. అవి ఉద్రేకమును కలిగించుచుండును. జీర్ణకోశమును జెడఁగొట్టుచుండును. అట్లే చుట్ట, బీడి, సిగరెట్టు, నశ్యము, గంజాయి, సారాయి, కల్లు మొదలగునవన్నియును మానవుని ఆరోగ్యమును జెడఁగొట్టునవియే. సాధకుఁడగువాఁడు వీనికి లొంగకుండవలయును. ఆహారము నెల్లప్పుడును హితముగను, మితముగను దీసికొనవలయును. రుచిగా నున్నదని అమితముగ దినరాదు.

శ్లో॥ పక్షక్షౌరం త్రిభిః స్నానం పంచ భిర్దంచ ధావనమ్ ॥

పదునైదు దినములకొకసారి క్షౌరమును. ప్రతిదినము మూఁడు పూఁటలు స్నానమును, ప్రతిదిన మైదుసార్లు ఉదయమునను, భోజనమునకు ముందును, భోజనమునకు తరువాతను. అట్లే సాయంకాలము భోజనమునకు ముందును, భోజనము తరువాతను దంతధావన మొనర్పవలయును.

ఎక్కువగఁ గారము, పులుసు, తీఁపి, వగరు, చేదు, ఉప్పు పదార్థములను దినరాదు. మితముగ వాడవలయును. గోళ్ళను నోటితోఁ దీసికొనరాదు. మల మూత్ర విసర్జన మొనర్చినఁ గాళ్లు చేతులను గడిగికొని, మూత్ర విసర్జనమున నాలుగుసార్లును, మలవిసర్జనమున నెనిమిదిసార్లును బుక్కిలించి వేయవలయును. నిలుచుండి ఉచ్చబోయుట శాస్త్రసమ్మతము కాదు. 'అనాచార భయం నాస్తి తిష్ఠన్మూత్రస్య సన్నిధౌ', నిలుచుండి ఉచ్చబోయువాని సన్నిధిలో అనాచార భయముండదు. సూర్య చంద్రులకును, దేవాలయములకును, స్త్రీలకును, సాధువులకును, గోవులకును, తులసి, రావి మొదలగు చెట్లకెదురుగఁ గూర్చుండి మలమూత్ర విసర్జన మొనర్పరాదు.

దంతధావనమునకు వేఁప, మర్రి, మామిడి, ఉత్తరేణు, గానుగ మొదలగు పుల్లలతోఁ బలు దోమవలయును. లేదా సుద్ద పొడి (Chalk Powder) మిరియాలపొడి, పటికపొడి, దాల్చినచెక్కపొడి వీని పొడితోఁ బలు దోముకొనిన చాల ఆరోగ్యముగ నుండును. పేష్టులుకూడ వాడవచ్చును. నీంబ్ పేష్టు చాల శ్రేష్ఠము.

చన్నీళ్ళ స్నానము శ్రేష్ఠము. వృద్ధులును, రోగులును మానె రామకొనినవారు వేడినీటితో స్నాన మొనర్పవలయును. స్నానమును జేసి పొడిగుడ్డతోఁ దుడుచుకొనవలయును తరువాత నేదైన ననుష్ఠాన మొనర్పవలయును. భగవంతుని భజింపని జన్మము వృథా. కేవలము లౌకిక జీవితమును గడుపువానికిని పశువునకును భేదమేమి కలదు ?

జీవితములోఁ గొన్ని నీతులను బాటింపవలెను.

1. సత్యమును, మృదువుగను, మధురముగను, శీతలముగను బలుకవలయును. ఇతరులకు బాధనుగలిగించు సత్యము సత్యము కాదు.

2. హింసను జేయరాదు. చేయించరాదు. ప్రోత్సహింపరాదు. హింస చేయకబోయిన చాలను.

3. పరుల కపకారము నొనర్పరాదు. కోరి కోరి ప్రయత్నపూర్వకముగ నుపకార మొనర్పవలెను.

4: మోసము చేయరాదు. ఇంకొకఁడు నీకు మోస మొనర్చిన నీ కెంతటి బాధయో వారికిని అంతేకదా !

5. నిరంతరము ఇతరుల క్షేమమునే చూచుచుండ వలయును. స్వార్థత్యాగము ముఖ్యము.

6. ఎప్పుడును నవ్వుచు, సంతోషముగ మాటలాడుట నేర్చుకొనవలయును.

7. కష్టము నోర్చుకొనుటకు ప్రయత్నింపుము. ఇతరులకు గష్టమును గలిగింపరాదు.

8. ఇతరుల వస్తువులకును, ద్రవ్యములకును ఆశను జెందరాదు.

9. దేవుని భజింపుము. కాని దంభమును బ్రదర్శింపకుము. దంభము లోకమును మోసముచేయుటకును; తాను ఆత్మవంచన మొనర్చుకొనుటకును బనికి వచ్చును.

10 పరుల దోషములను బాటింపరాదు. నీదోషములను నీవుచూచుకొనుము. ఇతరులలో నీవేమి చూచెదవో, అవి నీ దగ్గఱకు వచ్చును. నీలో నీవేమి చూచుకొందువో అవి లేచి పోవును.

11. పితృద్రోహము, మిత్రద్రోహము, దైవద్రోహము, స్త్రీద్రోహము, రాజద్రోహము చేయరాదు.

12. పరస్త్రీని దల్లిగాఁ జూచుకొనుము; పరద్రవ్యమును మంటి పెళ్ళగాఁ జూచుకొనుము.

13. నీ తల్లి, నీ సోదరి, నీ కూఁతురెంతో పరస్త్రీలందఱు అంతే. నీ కంటెఁ బెద్దవారిని దల్లులుగాను, సమానవయస్కలను సోదరీమణులుగను, చిన్నవారిని తన కూఁతుండ్రగను భావింపవలయును.

14. బ్రహ్మచర్యమును బాటింపవలయును. గృహస్థులు గృహస్థ బ్రహ్మచర్యమును బాటింపవలెను;

15. జిహ్వ, గుహ్యములు వాని యింద్రియార్థముల విషయములో లోభ బెట్టును. ముఖ్యముగ వానిని జయింప వలయును.

16. ఏ విషయము మీఁదకైనను మనస్సుపోయినచో ఆ విషయములోఁగల దుఃఖదోషాను దర్శనమొనర్పవలయును అప్పుడు వైరాగ్యము కలుగును.

17. కామము, క్రోధము, లోభము నరకద్వారములు. కామమును జయించుట దుస్సాధ్యము.

18. క్రోధమే పాపము. కోపమును జెందువాఁడసమర్థుఁడు. ఓర్పుచాల ముఖ్యము. కోపికి ఆసమయమున రక్తము బుకుకును. వేడి యెక్కును. అది ఆయుస్సును క్షీణింపఁజేయును. కామక్రోధములు రెండును నాయుస్సును క్షీణింపఁజేయునవే.

19. సహనము మానవునకు చాల ముఖ్యము. సహనము లేనివాఁడపకీర్తి పాలగును, సహనము యోగ్యత కొక పరీక్ష

20. ఋజుత్వము ముఖ్యము. ఋజుత్వము లేనివాని నెవరును నమ్మరు. శీలము ముఖ్యము.

21. బ్రహ్మచర్యము ముఖ్యము. 'ఆయుష్యం బిందు ధారణాత్' బిందు ధారణము వలన నాయుష్యము పెరుగును. శరీరబలమును గాపాడుకొనుము.

22. అహంకారము పనికిరాదు. అది మర్యాదను జెరుచును.

23 ఇతరుల సొమ్మును ఆశింపరాదు. మన సొమ్మును దుబారా చేసికొనఁగూడదు.

24. దుష్టసహవాస మొనర్పరాదు, దుష్ట గ్రంథముల నధ్యయన మొనర్పరాదు. దుష్ట ప్రదర్శనములను జూడరాదు.

25. సత్సంగ మొనర్పవలయును. ఒక వ్యక్తియొక్క గుణదోషములను వాని సహవాసగాండ్రను బట్టి నిర్ణయింప వచ్చును.

26. లాభనష్టములు, నిందాస్తుతులు, మానావమానములు వీనియందు సమభావముంచవలయును.

27. మౌనమును పాటించుట అభ్యాస మొనర్చుకొనుము. వాజ్మౌనము మంచి బల మొసగును. మానసిక మౌనము చాల ముఖ్యము.

28. భక్తితో ప్రతి దినమును జపమును, ధ్యానమును, సంకీర్తనను, దైవపూజను చేసికొనుచుండవలయును.

29. సర్వకాల సర్వావస్థలందును భగవన్నామస్మరణము నొనర్చుచుఁ దన విద్యుక్త కార్యములను జూచుకొనుచుండవలెను.

30. నిరాడంబరముగ నిత్యమును విడువక ధ్యానమొనర్చుచుండవలయును. అన్ని జీవుల హృదయములలోఁ దానున్నట్లును, తనలో నన్ని యున్నట్లును భావించుకొనవలయును.

31. ఏ పరిస్థితులలోను నీ దేశమునందును, దేవునియందును, మతమునందును విశ్వాసమును వీడక స్వమతమును రక్షించుకొనవలయును.

32. ఎన్ని కష్టములు వచ్చినను కామినీ, కాంచన, ప్రతిష్ఠా కాంక్షలకు లొంగక జీవిత లక్ష్యమును సాధించుటకుఁ బూనుకొనవలయును.

33. నీ లక్ష్యము నందుకొనుటకై భగవంతునకు శరణాగతి నొనర్పుము. సర్వము నాతఁడే చేయగలఁడని విశ్వసించుము.

34. ముందు విషయమును గూర్చి ఆలోచించుకొనకుము. ప్రకృతము నీవేమి చేయవలయునో శాస్త్రము ననుసరించి దానినట్లు చేయుటకు ప్రయత్నింపుము.

35. ఇంకొక్క నిమిషమునకు జావు కలదని ధర్మమును జేయుము. నూరేండ్లు బ్రదుకగలమను భావముతో ధన సంచయమును, ధర్మసంచయము నొనర్పుము.

36. స్వార్థబుద్ధితో సాధువులను, దేవతలను, అనాయకులను, పసివాండ్రను వంచింపకుము.

37. నిరంతరము మృత్యువును, భగవంతుని జ్ఞాపకముంచుకొనుము. క్షణిక సుఖముల నాశింపకుము. శాశ్వత సుఖమును గాంక్షింపుము.

38. సమస్త కామనలను వైరాగ్య శస్త్రముచే ఖండింపవలయును.

39. ఆత్మ వంచన మొనర్చుకొనకుము. నిత్యతృప్తిని బాటించుచుండుము. ఇఁక నీయంతటివాఁడుండఁడు.

40. జీవితము బుద్బుదము వంటిదని సదా నమ్ముము.

## మన దేవాలయములు - మఠములు

భగవంతుఁడు సర్వవ్యాపకుఁడైనను, దేవాలయములలో, మంత్రరూపమునను. ప్రతీక రూపముననుండును. అగ్ని సర్వవ్యాపకముగ నుండినను, నెచ్చట మథించిన నచ్చట వ్యక్తమైనట్లు దేవాలయమందు భగవద్విభూతి యుండును. ఆకాశ

మున నావిరిరూపమున జలము కలదు. అది కొంచెము చల్ల బడి మేఘమైనది. ఆవిరిరూపమున నవ్యక్తముగ నుండినది. ఇప్పుడు వ్యక్తమైనది. ఇదియే క్రిందకు వర్షించినది. నదియై ప్రవహించినది. అది కాలువరూపమున వచ్చినది. దానిలోని నీరు మన చెంబులో నున్నది. మనకు దాహమైనపుడు మన చెంబులోని నీటివలన దాహము, తాపము తీరును గాని, ఆకాశములోని ఆవిరివలనగాని, మేఘమువలనగాని, దూర మున నుండిన నది వలనగాని తీరదు. అట్లే సర్వవ్యాపకముగు నిర్గుణ పరబ్రహ్మవలనగాని, వ్యక్తమైన సగుణబ్రహ్మవలన గాని, పైనుండి క్రిందకు దిగిన నవతారము వలనగాని, అంశమువలనగాని, అందఱకును దాపము తీరదు. కేవలము చెంబులోని నీరువలె నర్చావతారము వలననే అన్నియును దీరును. అందఱకు సంతుష్టిగా నుండును. మన హిందూ దేవాలయముల వలన శిల్పము, కళలు, మంత్రశాస్త్రము మొదలగునవి కూడ పోషింపఁబడుచున్నవి. ఇది ప్రపంచములో నే దేశమునకును లేని విలక్షణత. దీని నిట్లే సక్రమముగఁ బోషింపవలయును.

అట్లే మన ఆర్షమతముల వారును వారివారి సాంప్ర దాయక ప్రచారము కొఱకై మఠములను, ఆశ్రమములను నేర్పాటుచేసికొనిరి. వానిద్వారా, ఆ పీఠముల నధిష్ఠించిన మహాత్ములు మన సంస్కృతిని, మతమును, సాంప్రదాయము లను సంచారము చేసి ప్రచారము చేయుచుండిరి. అట్లే ఆశ్రమ

ములలో, ఆశ్రమాధిపతులు చక్కగా శాస్త్రానుసారముగ వారు నడుచుకొనుటయే కాక వారి నాశ్రయించిన నాశ్రమస్థులను గూడ ఉత్తేజుల నొనర్చి సదాచారము ననుష్ఠించునట్లు చేయుచుండిరి.

ఇంకొక విలక్షణత ఏమనఁగా మన దేశములోఁ బండుగులను బాటించుట కలదు, అవతారపురుషుల జయంతులు. ఇతర పండుగులను మనము పాటించు చుండవలయును. ముందుగా నాపండుగులనుగూర్చి మనము తెలిసికొనవలయును.

## మన పండుగులు

### ఉగాది

మన హిందూదేశములో బార్హస్పత్య మానమనియు, చాంద్రమానమనియు, సౌరమానమనియు మూఁడు విధములుగ గలదు. వింధ్యపర్వతమున కుత్తరమున బార్హస్పత్య మానము వ్యవహారములోఁ గలదు. అది బృహస్పతి చారమును బట్టి లెక్కింపఁబడుచుండును. వింధ్యకు దక్షిణమునను మన ఆంధ్ర దేశపు దక్షిణపు సరిహద్దు వఱకు చాంద్రమానమును బాటించెదరు దక్షిణదేశమున సౌరమానమును బాటించెదరు. చాంద్రమానము చంద్రుఁడు పూర్ణిమా దినమున నే నక్షత్రమున నుండునో ఆ మాసమున కంతకును దానికి సంబంధించిన పేరు వచ్చును. చంద్రుఁడు పూర్ణిమా దినమున చిత్తా నక్షత్రము దగ్గఱనుండినఁ జైత్ర మాసమగును. విశాఖా

నక్షత్రము దగ్గఱనుండిన వైశాఖ మనఁబడును. జ్యేష్ఠా నక్షత్రము కడనుండిన జేష్ఠమనబడును. చంద్రుడు పూర్వాషాఢ లేక ఉత్తరాషాఢ నక్షత్రముల వద్ద నుండిన నాషాఢ మాస మనఁబడును, శ్రవణా నక్షత్రము దగ్గఱ నుండిన శ్రావణ మగును. పూర్వాభాద్ర లేక ఉత్తరాభాద్ర దగ్గఱ నుండిన భాద్రపదమాసమగును. అశ్వనీ నక్షత్రము సమీపమున నుండిన నాశ్వీజమాసమగును. కృత్తికా నక్షత్రము దగ్గఱనుండినఁ గార్తీకమాసమగును. మృగశిరా నక్షత్రము దగ్గఱనుండిన మార్గశిరమాసమగును. పుష్యమీ నక్షత్రము దగ్గఱనుండినఁ బుష్యమాసమగును. మఘానక్షత్రము కడనుండిన మాఘ మాసమగును. పూర్వఫల్గుణి లేక ఉత్తరఫల్గుణి నక్షత్రము దగ్గఱనుండిన ఫాల్గుణమాసమగును. వింధ్యకు ఉత్తరమునను మన మాసముల పేర్లే యుండును. గాని 15 దినములు తేడాగా నుండును. మనకు ముందు శుక్లపక్షము తరువాత కృష్ణపక్షము వచ్చును. వారికి ముందుగాఁ కృష్ణపక్షమును తర్వాత శుక్ల పక్షమును వచ్చును దక్షిణమున మేషము, వృషభము మిధునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము ధనుస్సు, మకరము, కుంభము మీనములలో సూర్యుఁడు ప్రవేశించినప్పు డా యా రాసుల పేర్లతో మాసమేర్పడును.

మన ఆంధ్రదేశమున మాసము చైత్రశుద్ధపాడ్యమితోఁ బ్రారంభమగును. దానికి ఉగాది అని పేరు. మన వ్యవహార ములలో 60 సంవత్సరములు కలవు. 1. ప్రభవ 2. విభవ 3. శుక్ల 4. ప్రమోదూత 5. ప్రజోత్పత్తి 6: ఆంగీరస

7. శ్రీముఖ 8. భావ 9. యువ 10. ధాత 11. ఈశ్వర 12. బహుధాన్య. 13. ప్రమాది. 14. విక్రమ. 15. వృష 16. చిత్రభాను. 17. స్వభాను. 18. తారణ. 19. పార్థివ. 20. వ్యయ 21. సర్వజిత్తు 22. సర్వధారి 23. విరోధి 24. వికృతి 25. ఖర 26. నందన 27. విజయ 28. జయ 29. దుర్ముఖి 30. మన్మథ 31. హేవిళంబి 32. విళంబి 33. వికారి 34. శార్వరి 35. ప్లవ 36. శుభకృతు 37. శోభకృతు 38. క్రోధి 39. విశ్వావసు 40. పరాభవ 41. ప్లవంగ 42. కీలక 43. సౌమ్య 44 సాధారణ 45. విరోధికృతు 46. పరీధావి 47 ప్రమాదీచ 48. ఆనంద 49. రాక్షస 50. నల 51, పింగళ 52. కాళయుక్తి 53. సిద్ధార్థి 54. రౌద్రి 55. దుర్మతి 56, దుందుభి 57. రుధిరోద్గారి 58. రక్తాక్షి 59. క్రోధన 60. అక్షయ.

1. ఆదివారము, 2. సోమవారము, 3. మంగళవారము 4. బుధవారము, 5. గురువారము, 6. శుక్రవారము, 7. శనివారము: ఇవివారములు

1. అశ్వని 2. భరణి 3. కృత్తిక 4. రోహిణి 5. మృగశిర 6. ఆరుద్ర 7. పునర్వసు 8. పుష్యమి 9. ఆశ్లేష 10. మఘ 11. పుబ్బ (పూర్వఫల్గుణి) 12. ఉత్తర (ఉత్తరఫల్గుణి) 13. హస్త 14. చిత్త 15. స్వాతి 16. విశాఖ 17. అనూరాధ 18. జ్యేష్ఠ 19. మూల 20. పూర్వాషాఢ 21. ఉత్తరాషాఢ 22. శ్రవణము 23. ధనిష్ఠ 24. శతభిషము 25. పూర్వాభాద్ర 26. ఉత్తరాభాద్ర 27. రేవతి.

యోగములు :- 1. విష్కంభము 2. ప్రీతి 3. ఆయుష్మాన్ 4. సౌభాగ్యము 5. శోభనము 6. అతిగండము 7. సుకర్మము. 8. ధృతి 9. శూలము 10. గండము 11. వృద్ధి 12. ధ్రువము 13. వ్యాఘాతము 14. హర్షణము 15. వజ్రము 16. సిద్ధి 17. వ్యతీపాత్ 18. వరీయాన్ 19. పరిఘము 20. శివము 21. సిద్ధము 22. సాధ్యము 23. శుభము 24. శుభ్రము 25. బ్రహ్మము 26. ఐంద్రము 27. వైధృతి.

కరణములు:- 1. బవ 2. బాలవ 3. కౌలవ 4. తైతుల 5. గరజి 6. వణిజి 7. శకుని 8. భద్ర 9. చతుష్పాత్ 10. నాగవము 11. కింస్తుఘ్నము.

ఇవి యైదు నుండుటచేఁ బంచాంగమని పేరు వచ్చినది.

ఉగాది (సంవత్సరాదిని) రోజునఁ గ్రొత్త పంచాంగములకు బూజలు చేయవలయును. అసలా దినమునఁ జేయవలసిన కృత్యములు చెప్పఁబడుచున్నవి. ఉగాది చైత్ర శుద్ధ పాడ్యమినాఁడు వచ్చును. ఆ దినమున నుదయముననే లేచి కాలకృత్యములను తీర్చుకొని అభ్యంగన స్నాన మొనర్పవలయును. తూర్పునకు దిరిగిగాని, ఉత్తరమునకు దిరిగికాని తల యంటించుకొనవలయును. తనకు దానుగాఁ దల యంటుకొనరాదు. దూలము క్రిందను, చూరుక్రిందను గూర్చుండి తల అంటించుకొనరాదు. ఆముదము, తైలము శ్రేష్ఠము. భృంగామలకము. చందనాది తైలము, ఆమలకాది తైలము, సరస్వతీ (బ్రాహ్మీ) తైలాదులు శ్రేష్ఠములు. అభ్యంగన

స్నానము మంగళవారాదులందు పనికిరాదు. పురుషులకు శని వారమును, స్త్రీలకు శుక్రవారమును శ్రేష్ఠములు. ఓషధులు కలిసిన తైలముతో నేరోజైనను అభ్యంగన మొనర్పవచ్చును. అభ్యంగనము కాఁగానే నూతన వత్సరము కావున నూతన వస్త్ర ధారణము ముఖ్యము. ఆ సంవత్సర క్రొత్త పంచాంగ మునకు గంధ పుష్పాదులతోఁ బూజించవలెను. మామూలుగా స్వామిపూజను చేసికొనవలయును నూతన సంవత్సర మున వేఁప ప్రసాదమును దినవలయును. వేఁపపువ్వు, చింతపండు పులుసు, బెల్లం, మామిడికాయ ముక్కలు, యాలకులు నూరి వైచి ప్రసాదమును చేసి భగవంతునకు నివేదించి, అంద ఱును దినవలయును. సంవత్సరాదిని చేదును దినుట శుభ స్కరము. వేఁప పూవులో శరీరములోని క్రిములను జంపు గుణమున్నది. వ్యత్యాసములైన వాత పిత్త శ్లేష్మములను సమానస్థితికి దెచ్చి ఆరోగ్యమొసంగును. పంచాంగ శ్రవణ మొనర్పవలయును. పంచాంగమున వారము, తిథి, నక్షత్రము, యోగము, కరణము అను నైదంగము లుండును. అందు వలనఁ పంచాంగ మందురు. ఇంకను వర్జ్యము, చారములు, పండుగులు మొదలైనవి యుండును. ఏవైన వృత్తి మొదలైన వానికి సంబంధించిన పనుల నా దినమునఁ బ్రారంభించుట మంచిది. ఈ దినముననే వసంతఋతువు ప్రారంభము. వసంత నవరాత్రు (రామ నవరాత్రు) లీ దినమున ప్రారంభమగును. శ్రీరామ నవమితో నవరాత్రులు పూర్తి కాఁగలవు.

# వసంత నవరాత్రులు

శ్రీరామచంద్రుఁడీ చైత్రమాసముననే అవతరించినారు. ఆయన పూర్ణావతారము. పూర్ణ సంఖ్య 9 (తొమ్మిది) ఇంతకు మించిన సంఖ్య లేదు. 'న జహాతి పూర్వరూపం నవమీ సంఖ్యైవ' తొమ్మిది సంఖ్య దాని పూర్వ రూపమును బోఁగొట్టుకొనదు.

$9 \times 1 = 9 = 9$ $9 \times 6 = 54 = 9$

$9 \times 2 = 18 = 9$ $9 \times 7 = 63 = 9$

$9 \times 3 = 27 = 9$ $9 \times 8 = 72 = 9$

$9 \times 4 = 36 = 9$ $9 \times 9 = 81 = 9$

$9 \times 5 = 45 = 9$ $9 \times 10 = 90 = 9$

ఇందులో నేమియును మారలేదు.

శ్రీ రామచంద్రుఁడు చైత్రశుద్ధ నవమీ దినమున నవతరించెను. శుద్ధపాడ్యమి మొదలు నవమి వఱకు శ్రీమద్రామాయణ పారాయణమును నవాహ్నిక దీక్షదోఁ జేయవలయును రామాయణోపదేశమును బొంది పారాయణముచేయవలయును. ఊరక చదువుకొను వారికుపదేశమక్కఱలేదు.

## శ్రీ రామ నవమి

శ్రీరామ జననము చైత్రశుద్ధనవమీ, పునర్వసూ నక్షత్రమునఁ గర్కాటక లగ్నమున జరిగినది. కాలమునరిగా మధ్యాహ్నము 12 గంటలకు. మన నీడను మనము త్రొక్క-

కొనుచుందుము ఆరోజునఁ జేయవలసినది జన్మదినము. కొందఱు భద్రాద్రిలోఁ జేయుచున్నారని ఆరోజునఁ గల్యాణమును జేయుచుండెదరు. రామదాసు కారాగృహమునుండి విముక్తుఁడై వచ్చిన తర్వాత శ్రీరామునకు నవమీ దినమునందే కల్యాణము నొనర్చినాఁడు. అందువలన మన దేశమున నా యాచారమే ప్రచలితమైనది. కాని ఆ రోజునఁ జేయవలసినది జన్మదినోత్సవము. ఆ రోజున నుపవాసముండవలయును. దశమినాఁడు పారణ చేయవలెను. నవమినాఁడు శ్రీ రామపూజను గావించుకొని పానకము, వడపప్పు కొబ్బరికాయలు, మామిడిపండ్లను నివేదింపవలయును. ఎండకాలము కావున విసనకఱ్ఱలను బంచు నాచారము కూడ కలదు.

కల్యాణము జరిగినది మార్గశిరమాసములోనని తులసీ రామాయణమునఁ గలదు. ఉత్తరదేశమున మార్గశిర శుద్ధ పంచమి, శ్రవణా నక్షత్రమున సాయంకాలము గోధూళికా లగ్నమున జరిగినట్లు చెప్పెదరు. కల్యాణ మొనర్చిన భోజనమును జేయవలయును. ఉపవాసముండరాదు. కల్యాణమునకుఁ గావలసిన వస్తువులు — శ్రీ సీతా రామలక్ష్మణ విగ్రహములు, మట్టెలు, మంగళసూత్రములు, ఉత్తరజంద్యములు, టెంకాయ బొళ్ళములు ½, టెంకాయలు, బియ్యాం. తలంబ్రాలబియ్యాం, ఖర్జూరపుకాయలు, వక్కలు, ఆకులు, కర్పూరము, అగరు వత్తులు, తోరణపుటాకులు. చిల్లరడబ్బులు, కొబ్బరిచిప్పలు (ఎండువి) చీరె, రవికలు2, రామలక్ష్మణులకు వస్త్రములు.

వడపప్పు, పానకము, ఇతర ప్రసాదములు, జీలకఱ్ఱ, బెల్లము పసుపు. కుంకుమ, 4 పళ్లెరములు, మూఁడు గ్లాసులు, అరటి పండ్లు మొదలగునవి.

ఈదినములందు శ్రీమద్రామాయణమును గుఱించియు, రామతత్త్వమును గూర్చియు ప్రవచనములు, హరికథలు, పురాణములు, నాటకములును ఏర్పాటుచేయుట అవసరము. దేవాలయము లుండిన మంచిమంచి ఉత్సవముల నేర్పాటు చేయవచ్చును. భజనలు, నామ సంకీర్తనము శ్రేష్ఠములగును.

## శంకర జయంతి - రామానుజ జయంతి

వైశాఖ శుద్ధ పంచమి చాల ముఖ్యమైనది. ఆ, కా మా, వై అనఁగా నాషాఢమాసము, కార్తికమాసము, మాఘ మాసము, వైశాఖ మాసము చాల శ్రేష్ఠమైనవి. అందులో నీ వైశాఖ మాసము కూడ కలదు. ఈ మాసములో శుద్ధ పంచమినాఁడే పార్వతీ కల్యాణము జరిగినది. సాయంకాలము గోధూళికా లగ్నమున జరిగినట్లు పురాణవచనము కలదు.

ఆ దినముననే శ్రీ శంకరభగవత్పాదులు కేరళ దేశములో కాలడీ గ్రామమున నవతరించిరి. వారికి ముందు బౌద్ధ మతము వ్యాపించినది దానిని మార్చి వేదోక్తమగు నద్వైత మతమును స్థాపించిరి వారు షణ్మతోద్ధారకులైరి. వైష్ణవ, శైవ, శాక్త, సౌర, గాణాపత్యాది మతములను సమర్థించు టయే కాక వీని అన్నిటిలో వ్యాపించిన తత్త్వ మొక్కటియే

యని నిరూపించెను. ఒకే పరమాత్మ వివిధ కల్పములలో వివిధ రూపములను ధరించి సృష్టిస్థితి లయాదులను నిర్వర్తించెను. భగవానుఁడే యిట్లు చెప్పెను. 'ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా' నా ప్రకృతిని నే నాశ్రయించి, నా మాయచే నేను బుట్టినవాఁడ నయ్యెదను,

భగవంతుని ప్రకృతు లెనిమిది :

శ్లో॥ భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥

పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి అహంకారము ఇవి నా ఎనిమిది ప్రకృతులు.

భగవానుఁడు ఒక్కొక కల్పమున నొక్క రూపమును ధరించును.

శ్లో॥ ఆకాశస్యాధిపో విష్ణుః అగ్నేశ్చైవ మహేశ్వరీ
వాయోస్సూర్యః క్షితేరీశః జీవనస్య గణాధిపః ॥

ఆకాశము నధిష్ఠానముగఁ జేసికొని విష్ణువైనాఁడు. అగ్ని నధిష్ఠానముగఁ జేసికొని శక్తి అయినది. వాయువు నధిష్ఠానముగఁ జేసికొని సూర్యుఁడైనాడు. పృథివి నధిష్ఠానముగఁ జేసికొని ఈశ్వరుఁ డైనాడు. జలము నధిష్ఠానముగఁ జేసికొని గణపతి యైనాఁడు. పరమాత్మ ఒక్కఁడే. ఒక్కొక్క కల్పమున నొక్కొక రూపమును ధరించును. ఇట్లైనను మతము లన్యోన్య మయిన మతములలోని పరమాత్మ ఒక్కఁడే. జీవుఁడు అంతఃకరణమునందు ప్రతిబింబించిన పరమాత్మయే.

అంతఃకరణము నాశనమైనఁ బ్రతిబింబ స్వరూపుఁడగు జీవుఁడు బ్రహ్మమునఁ గలిసిపోవును. "జీవో బ్రహ్మైవ నాపరః" జీవుఁడు బ్రహ్మయేకాని వేఱుకాదు. జీవునకును బ్రహ్మకును భేదము లేదు. తన యాత్మయే బ్రహ్మ. అది సర్వవ్యాపక మైనది. అంతయును దానని భావించుటయే ముఖ్యసాధనము. అందువలననే జగద్గురువైనాఁడు. ఏదోఒక రూపమును జెప్పినవాఁడు జగద్గురువు కాఁజాలఁడు. జగద్గురువు క్రైస్తవులకును, మహమ్మదీయులకును పార్శీలకును గూడ గురువే. ఆత్మ లేనివాఁ డెవఁ డున్నాఁడు : శ్రీ శంకరు లవతరించి సమస్త దేవతలను స్తుతించుటయే కాక, తన అద్వైతమత సిద్ధాంతమును వ్యాపింపఁ జేయుటకై నాలుగు దిక్కులను నాల్గు మఠములను స్థాపించెను. దక్షిణమున శృంగేరి, పశ్చిమమున ద్వారక, ఉత్తరమున జ్యోతిర్మఠము (బదరీ) తూర్పున జగన్నాథము, చివరకు సర్వజ్ఞపీఠమును దక్షిణదేశమున ముక్తిస్థానమగు కంచిలో స్థాపించిరి

## శ్రీమద్రామానుజాచార్యులవారు

శ్రీ శంకరులు అవతారమును జాలించిన షుమారు 1000 సంవత్సరములకు అందఱును వేదాంతులుకాఁగా భక్తి మార్గమును స్థాపించుటకై శ్రీమద్రామానుజులు అవతరించిరి. వారును వైశాఖశుద్ధ పంచమీ దినముననే అవతరించిరి. వీరు భక్తిమార్గమును బోధించిరి. విష్ణువు తప్ప వేఱు పరదైవతము లేదనియు, నారాయణ మంత్రమునకు మించిన మంత్రము లేద

నియు. శరణాగతియే పరమ సాధనమనియూ, ప్రపన్నుఁడైన వాఁడు పంచసంస్కార దీక్ష గైకొనవలయుననియు బోధించిరి. వారు విశిష్టా ద్వైతమతమును లోకమున వ్యాపింపఁజేసిరి. భక్తి మార్గమునకుఁ బుష్టి కావించిరి.

అద్వైతులు శంకరజయంతిని, వైష్ణవ విశిష్టాద్వైతులు శ్రీ మద్రామానుజుల జయంతిని వైశాఖశుద్ధ పంచమినాఁడు చేయవలయును. ఆ దినములలో వారి వారి సిద్ధాంతములను నుపన్యాసరూపమునఁ బ్రబోధ మొనర్పవలయును. వారివారి చరిత్రలను జెప్పవలెను.

వైశాఖమాసములో వైశాఖపురాణమును జదువుట యును, వినుటయును జాలముఖ్యము. అది ఎండకాలము కావున వస్త్రదానము, పాదరక్షలదానము, గొడుగుదానము చేయవలయును. చలివేంద్రిలు పెట్టి దాహశాంతి కావింప వలయును.

## నృసింహ జయంతి

వైశాఖశుద్ధ చతుర్దశి నృసింహజయంతి· దానిని సరిగా సూర్యాస్తమయము కాఁగానే చేయవలెను. జయవిజయులు శ్రీమన్నారాయణుని ద్వారపాలకులు. వారొకదినమున సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులను భగవంతుని కడకు రాకుండ నడ్డగించిరి. వారికి కోపమువచ్చి రాక్షసులు కండని శపించిరి. అప్పుడు జయ విజయులును మీరును రాక్షసులు కండని శపించిరి· అప్పుడు భగవానుఁడు వచ్చి వారిని వారిం

చెను. భగవానుడు వారితో నిట్లనెను:- జయవిజయులారా! నేను దశావతారముల నెత్తఁబోవుచున్నాను. మీరు అవతారములలో విరోధులుగ నుండెదరా? ఏడవతారములలో మిత్రులుగ నుందురా?,,

జయవిజయులిట్లనిరి:- "మేము మిత్రులముగా నేడు జన్మములు వైకుంఠమును వదలి యుండలేము. మూఁడు జన్మములు విరోధులుగనే యుందుము.

అట్లే వారొక జన్మమున హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగను, ఇంకొక జన్మమున రావణ కుంభకర్ణులుగను, మఱియొక జన్మమున శిశుపాల, దంతవక్త్రులుగనైరి వారిని సంహరించుటకై భగవానుఁడు పూర్ణావతారముల నెత్తెను. నృసింహుఁడుగను, శ్రీరాముఁడుగను, శ్రీకృష్ణుడుగను నయ్యెను. నృసింహ రామకృష్ణేషు షాడ్గుణ్యం పరిపూరితమ్' నృసింహావతారము రామావతారము, కృష్ణావతారములందు భగవానుఁడు పూర్ణముగ షడ్గుణైశ్వర్య వంతుఁడై యుండును. అందువలననే అవి ఉపాసనా యోగ్యములై యున్నవి.

సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాదులును జయ విజయుల శాపమువలన ప్రహ్లాద, సంహ్లాద, హ్లాద, అను హ్లాదులను పేర సనతరించిరి. అందులోఁ బ్రహ్లాదుఁడు భక్తి చేయఁగా దానిని హిరణ్యకశిపుఁడు సహింపఁజాలక నానా హింసలు పెట్టెను. కొండలనుండి త్రోయించెను. సముద్రములో బడవైచెను. పాములచేఁ గఱపించెను, ఏనుఁగులచేఁ ద్రొక్కిం

అంజనాదేవి కుమారుఁడు. అంజనాదేవి కేసరిభార్య. ఆమె అంధురాలు. కేసరికి వాయుదేవుఁడు స్నేహితుఁడు. ఆతనితో నిట్లనెను:- "వాయుదేవా! నేను కోఁతుల మందలను జూచు కొనుటకై కొండలు, వనములు తిరుగు చుందును. నా భార్య గ్రుడ్డిది. ఆమెకు ప్రతిదినము మధ్యాహ్నమునకు ఆహారమును గల్పింపుము."

వాయుదేవుఁ డంగీకరించెను. తారకాసురుఁడు దురాత్ముఁడు. ఆతనివలన దేవతలకును, మునులకును నుత్పాతములు గలుగుచుండెను. సతీదేవి దక్షయాగాగ్నిలో మరణింపఁగానే ఇఁకఁ దనకు పెండ్లియక్కఱలేదను కొనెను. కాని తారకాసురుఁడు శివుని వీర్యముచేఁ బుట్టినవానిచే మరణమును గోరు కొనుటచే నెట్లైనను శివునకుఁ బెండ్లి చేయవలయునని దేవతలు సంకల్పించి, మన్మథునిఁ బ్రేరేంచి సమాధిభంగ మొనర్చి పెండ్లి చేసికొని, సంతానమును గని తారకాసురుని జంపింపుమని ప్రార్థించిరి. శివుఁడంగీకరింపఁగా నాతని కొఱకై తపస్సును జేయుచుండిన హిమవంతుని కుమార్తెయగు పార్వతినిఁ బెండ్లి చేసిరి. పార్వతియును, పరమేశ్వరుఁడును సంతానమును గనుటకేకాంతమున నుండఁగా దేవతలు లోన నేమి జరుగుచున్నదో చూచిరమ్మని అగ్నిని బంపిరి. అగ్ని గవాక్షము నుండా చూడఁగాఁ బార్వతీపరమేశ్వరులు రతిక్రీడలోనుండిరి. అగ్నినిఁగాంచఁగనే వారు లేచుటచే శివుని వీర్యము నేలపైఁ బడెను. దానిని భూమి భరింపఁజాలననఁగా నగ్నివలన నట్లు

జరిగినది కావున నగ్నిని దానిని ధరింపుమని కోరెను. అగ్నికొంత ధరించెను. ఆతనికి మందము చేసెను. సరిగా వెలుఁగుట లేదు. ఇంతలో నగ్నికి మిత్రుఁడగు వాయువు తన మిత్రుఁడగు నగ్నికి తోడ్పడఁ దలఁచి నా వీర్యమును గొనిపోయి అంజనాదేవి దోసిలిలో వైచెను. ఆమె ఆహారమనుకొని మ్రింగెను. గర్భవతి యాయ్యెను. అగ్నిమ్రింగిన వీర్యమును స్వాహాదేవి ప్రతిదినమును దీసికొనిపోయి ఒక తెల్లుపొదలో బెట్టుచుండెను. అచ్చట, షణ్ముఖుఁ డుదయించెను. అంజనాదేవికి వైశాఖ బహుళ దశమీ శనివారమునాఁడుదయించెను. ఆఱవదినమున అమావాస్య. ఆరోజున సూర్యోదయము వేళ సూర్యగ్రహణము పట్టనుండెను. ఆఱురోజుల బాలాంజనేయులు ఉదయించు చుండిన సూర్యుని గాంచి ఫలమనుకొని యెగిరెను. సూర్యునిఁబట్టుకొని మ్రింగఁబోఁగాఁ అప్పుడే సూర్యుని మ్రింగుటకు వచ్చుచుండిన రాహువు ఆతని వారించెను. అప్పుడాంజనేయుఁడు రాహువును గూడ పట్టుకొనెను. రవి, రాహువులు తమరక్షణకై ఇంద్రుని కొఱకు ప్రార్థింపఁగా నింద్రుఁ డైరావతముపై నెక్కి వజ్రమును గైకొని వచ్చెను. ఇంద్రుఁడు వారింపఁగా సూర్యుని, రాహువును, ఇంద్రునికూడ పట్టుకొనెను. అప్పుడింద్రుఁడు తన కుడిచేతిలో నుండిన వజ్రముతో ఆంజనేయుని నడుమదవడపైఁగొట్టెను, ఆ దవడ సొట్టపోయి మూర్ఛపడెను. అప్పుడు వాయుదేవుఁడలిగెను. దేవతలంద ఱును వచ్చి, వాయుదేవుని శాంతింపఁజేసి, అనేక వరము

లొసంగెను. శివునివీర్యము చేఁ బుట్టుటచే శివుని కుమారుఁడనియు, వాయువు వీర్యము నొసంగుటచే వాయుకుమారుఁడనియు కేసరి క్షేత్రమున నుదయించుటచే కేసరీ పుత్రుఁడనియు, అంజనీదేవి తనయుఁడగుటచే నాంజనేయుడనియు. హనువు (దవడ) వంకర పోవుటచే హనుమంతుఁడనియుఁ బేరు వచ్చెను.

హనుమంతుఁడు రామభక్తులలో నగ్రగణ్యుఁడు. మహా పండితుఁడు. వేదవేత్త, భక్తుఁడు. మహాజ్ఞాని. పరాక్రమవంతుఁడు. ఆతని భజించిన సమస్త కోరికలు నెఱవేరుటయేకాక భూత. ప్రేత, పిశాచ, శాకినీ, ఢాకినీ, కామినీ, భేతాళాది గ్రహము లును, క్షుద్ర ప్రయోగాదులును విడిచిపోవును.

శ్లో॥ బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వం చ హనూమత్స్మరణాద్భవేత్ ॥

హనుమంతుని స్మరణమువలన బుద్ధియు, బలమును, కీర్తియు, ధైర్యము, నిర్భయత్వము, రోగనివారణము, వ్యాధి లేకుండుట వాక్పటుత్వము ఇవన్నియు లభించును.

## కూర్మ జయంతి

జ్యేష్ఠబహుళ ద్వాదశినాఁడు కూర్మజయంతి వచ్చును. దేవతలును, రాక్షసులును అన్నదమ్ములే. వీరెల్లప్పుడును కలహించుకొనుచుఁ గొట్టుకొని చచ్చుచుండిరి. వారొకా నొకప్పుడు పరస్పరము స్నేహమును గలిగియుండి 'మనము పరస్పరము కలహించుకొనుచుఁ గొట్టుకొని చచ్చుట బాగుండ లేదు. చావకుండు నట్లైదైన మందును గనుఁగొనవలయునను

కొనిరి. భగవదాదేశము వలన వా రనేక ఓషధులను దెచ్చి, మందరము కవ్వముగాను, వాసుకిని త్రాడుగను జేసికొని ద్రచ్చ నారంభించిరి. అప్పుడు కొండ అటునిటు వరుగుచుండెను అది వరిగి పోకుండునట్లు భగవానుఁడు కూర్మావతారమునెత్తి కొండక్రింద నుండెను, వారు కూర్మావతారము నెత్తినదినము జ్యేష్ఠబహుళ ద్వాదశి. ఆ దినమున భగవానునిఁ బూజించి కూర్మావతార కథను వినవలయును.

## సుబ్రహ్మణ్య షష్ఠి (కుమారషష్ఠి)

ఆషాఢ శుద్ధ షష్ఠి కుమార షష్ఠి. శివవీర్యమును అగ్నిహోత్రుఁడు ధరింపగా స్కందముచేసెను. దానిని స్వాహాదేవి రోజునకొక ఋషియొక్క భార్యరూపమును ధరించుచు నా వీర్యమును గ్రహించిగంగయొడ్డున నుండిన నొక రెల్లుపొదలోఁ బెట్టుచుండెను. ఇట్లాఱుగురు ఋషుల భార్యవేషములను ధరించెను. కాని మహాపతివ్రతయగు నరుంధతీ వేషము కుదురలేదు. ఆఱురోజులు ఒకే రెల్లు పొదలోఁ బెట్టుటవలన నాఱు తలలతోఁ గుమారస్వామి అవతరించెను. అతఁడు ఋష్యాశ్రమములకు రాఁగా నరుంధతికి తప్ప మిగిలిన ఋషి పత్నులకు బాలచేపు వచ్చెను. కుమారస్వామి ఆఱు తలలతో నొక్కసారిగా నాఱుగురవద్ద పాలను ద్రావెను. అట్లు త్రాగుచుండఁగా ఋషులు గాంచి వారాఱుగురను వెలిపెట్టిరి. వారు ఆకాశమునఁ గృత్తికానక్షత్రముగ నుండెను. అతఁడు శివవీర్యమునఁ బుట్టుటచే శివకుమారుఁడయ్యెను. అగ్ని ధరించుటచే నగ్ని

పుత్రుడయ్యెను. కృత్తికలకు బుత్రుడగుటచే కార్తికేయుం డయ్యెను. సుబ్రహ్మణ్యషష్ఠిరోజునం బుట్టలకు పాలు పోయు చుందురు.

## శయన ఏకాదశి (తొలిఏకాదశి)

ఆషాఢశుద్ధ ఏకాదశి శయన ఏకాదశి. తొలి ఏకాదశి యనియుం బేరు కలదు. ఆషాఢశుద్ధ ఏకాదశీనాఁడు భగవానుడు దక్షిణపుశాలపెట్టి కుడిచేతి మీఁదఁబరుండియుండును. భగవానుఁడు విశ్వస్వరూపుఁడు. ఆతని కన్నులు సూర్యచంద్రులు. ఱెప్పలు మేఘములు. నడుమునుండి పైన నేదూర్ధ్వలోకములు. నడుమునకుఁ గ్రిందనే డధోలోకములు. ఆషాఢ శుద్ధ ఏకాదశి నాఁడు శయనించుననఁగా సూర్యునిఁ జంద్రునిఁ గన్నులుగాఁ గలిగిన నాతఁడు నిద్రించుటకు ఱెప్పలను మూయును. అనఁగా నాషాఢశుద్ధ ఏకాదశి నుండి మేఘములచే సూర్యచంద్రులు కప్పఁబడుదురు కుడిచేతి మీఁదఁ బరుండినాఁడు కావున నాతని శ్వాస వాయువు. అనఁగా నైరృతీ ఋతుపవనము వీచును భగవంతుఁడు నిద్రవోఁడు. నిద్రావ్యాజమునఁబరుం డును. అప్పటినుండి నాలుగు నెలలు చాతుర్మాస్యలు. ఈ నాల్గు నెలలు నిద్రించును. అనఁగా నీ నాలుగు నెలలును ఆకాశము మేఘాచ్ఛాదితమై యుండును. ఈనాలుగు నెలలును నాహారనియమములను, భగవదారాధనా నియమములను బాటింపవలయును. సన్న్యాసులీనాల్గునెల లెచ్చటికిని గద లరు. చాతుర్మాస్య వ్రతము నాచరింతురు. అనేక జీవులు

పుట్టు సమయము కావున నవి వారి కాళ్ళ క్రిందఁబడి చచ్చు నని యెచ్చటికిని బోరు.

ఏకాదశి నాఁ డుపవసింపవలయును. నిర్జలోపవాసము శ్రేష్ఠము. ఫలాహారములని అన్నమునకంటె నెక్కువగఁ దిన రాదు. ఏకాదశీ దినమున నుపవసింపఁజాలకుండిన ఫలాహారము చేయవచ్చుననరాదు. ఫలాహారము చేయుదురని మాత్రమే అనవలయును. జాగరణముండి ద్వాదశీపారణ మొనర్పవలయును. దశమి నాఁ డేక భుక్తమును, ఏకాదశీనాఁడు నిరాహారమును, ద్వాదశీదినమున నేక భుక్తము చేయవలయును.

## వ్యాసపూర్ణిమ (గురుపూర్ణిమ)

ఆషాఢపూర్ణిమ ఆ, శా, మా వైలో చాల ముఖ్యమైనది. ఈ దినమున సముద్రస్నానములు, నదీస్నానములు చేయుదురు. సన్న్యాసులు వ్యాసపూజను జేసెదరు ఈదినముననే వ్యాసభగవానుఁడు బ్రహ్మసూత్రాది రచనములను సాగించి జగద్గురుడైనాఁడు. ఈ దినమునఁ దమ తమగురువులకు పూజచేసికొని యానందించెదరు. ఈ దినమున వారి వారి సాంప్రదాయముల ననుసరించి వారి వారి గురు సంప్రదాయ మహిమమును గూర్చి చెప్పుకొన వలయును. గురు ఋణమును నెవరు తీర్చుకొనఁగలరు. ఆ దినమునఁ దమ తమ గురువులను వ్యాసరూపముగ భావించి గౌరవింపవలయును.

కర్కాటక సంక్రమణము (దక్షిణాయనము) సూర్యుఁడు మకరరేఖనుండి బయలుదేరి పోవుటకు ఉత్తరాయణమని పేరు.

సూర్యుఁడు సరిగా మకరరేఖ మీఁదకు డిశెంబరు 21 వ తేదీకి వెళ్ళును జనవరి 14న ఉత్తరముఖముగ బయలుదేరును. భూమధ్యరేఖ మీఁదకు వచ్చునప్పటికి మార్చి 21, 2 తేదీలగును. అచ్చటినుండి ఉత్తరముగ 23½° వఱకు పోఁగానే కటకరేఖ వచ్చును. అచ్చటినుండి మరల సూర్యుఁడు వెనుకకుఁ దిరుగును. ఇదియే దక్షిణాయనము. పునర్వసు 4వ పాదములోనికి సూర్యుఁడు వచ్చునప్పటికి కర్కాటకమగును. ఈ దక్షిణాయన పుణ్యకాలమున నదులందును చెరువులందును, కనీసము బావులందును జిల్లేడాకులను, శిరస్సునను, భుజముల మీఁదను పెట్టుకొని స్నానముచేయవలయును. ఋతువుమారుచున్నది కావున వాతాది దోషములు దీనివలనఁబోవును. కొందఱుజిల్లేడాకులు దొఱకకుండినఁ జిక్కుడాకులను బెట్టుకొని స్నానముచేయుదురు. అవి అంత ప్రశస్తములు కావు.

## మంగళగౌరినోములు

శ్రావణమాసమునందు నూతన వధువులు మంగళవారమునాఁడు మంగళగౌరీ పూజను జేసికొందురు గౌరీ దేవి మహాపతివ్రత. ఆమె మంగళసూత్రమును నమ్ముకొనుటచే శివుఁడు హాలాహల పానమొనర్చినను నామె మంగళసూత్రము నిలిచినది. అందువలన నూతన వధువులు అయిదు సంవత్సరములు వరుసగా మంగళగౌరీ నోములను నోచుకొని, తోరములను గట్టుకొని ఆ నోము మహిమమును బ్రదర్శించు కథను విని ముత్తైదువులకు సెనగలు, చలిమిడి మొదలగు ప్రసాదములను బంచెదరు

ఇట్లు శ్రావణమం దెన్ని మంగళవారములు వచ్చునో, అన్ని మంగళవారము లందును జేసికొందురు.

# వరలక్ష్మి వ్రతము

శ్రావణమునఁ బూర్ణిమకు ముందువచ్చు శుక్రవారము నాఁడు వరలక్ష్మీవ్రతము చేయుదురు. ఆరోజున లక్ష్మి అను గ్రహముకలిగి భోగభాగ్యము లనుభవించెదరు. వరలక్ష్మీ వ్రతమునకుఁ దొమ్మిది పిండివంటలు చేయుదురు. ముత్తైదువు లను బిలిచి ప్రసాదములను బంచెదరు. ఒకవేళ నేదైన విఘ్నం దుఃవలన శుక్లపక్ష శుక్రవారమున వీలుకాకుండినఁ కృష్ణపక్ష మునను జేసికొనుట కలదు.

శ్రావణపూర్ణిమనాఁడుపాకర్మ చేసికొందురు. నూతన వటువులకు ఉపాకర్మ కార్యక్రమము చాల ముఖ్యము. ఈ దినమున నుపనయనమురోజున గట్టిన ముంజను విడిపించెదరు. బ్రహ్మచారులును, గృహస్థులును నూతన యజ్ఞోపవీతములను ధరించెదరు.

# శ్రీకృష్ణజయంతి

"కృష్ణస్తు భగవాన్ స్వయమ్" కృష్ణుఁడు సాక్షాత్తు భగవంతుఁడు. జయ విజయులు శిశుపాల దంతవక్త్రులు కాఁగా వారిని సంహరించుటకై కృష్ణుఁడుగ నవతరించెను. శ్రీకృష్ణావతారమునకు ముఖ్యముగ పైకారణముకాక యింక మూఁడు కారణములు కనఁబడుచున్నవి. ఒకప్పుడు దేవతల

బలముకంటె రాక్షసుల బలమెక్కువకాఁగా అదితి కశ్యపులు స్వామినిగూర్చి తపస్సుచేసి, అసుర సంహారమొనర్చి తన బిడ్డలను గాపాడుమని ప్రార్థించిరి అప్పుడు భగవంతుఁడు తన తెల్ల వెండ్రుక నొకదానిని, నల్ల వెండ్రుక నొకదానినిఁ గ్రింపఁబడవైచెను. దానివలన ధర్మునకు నర, నారాయణులు ఉద్భవించిరి. వారు తపస్సునుజేసి, అస్త్రశస్త్రములను సంపాదించి రాక్షసులను జెండాడిరి. అప్పుడు నరుఁడు నారాయణు నిట్లడిగెను. "స్వామీ! తత్త్వోపదేశమును గావింపుఁడు" దానికి నారాయణుఁడు తాను ద్వాపరయుగమునఁ గృష్ణావతారము నెత్తఁదలఁచితిననియు, అప్పుడు భారతయుద్ధ ప్రారంభమునఁ జేసెదననెను. నరుఁ డర్జునుఁ డయ్యెను. నారాయణుఁడు కృష్ణుఁడయ్యెను. నరునకు జ్ఞానోపదేశమొనర్చుటకై నారాయణుఁడు కృష్ణావతార మెత్తెను.

వైకుంఠమునకంటెఁ బైననుండిన గోలోకమున నొక దినమున దివ్యరాస జరుగుచుండెను. ఆ రాస మధ్యమున శ్రీకృష్ణసఖుఁడగు సుదాముఁడు తన్మయమున రాసను జించుకొని లోనికిఁబోయెను. అప్పుడు రాసేశ్వరియగు రాధ మంచి రసానుభవసమయమున రాసమును భంగమొనర్చితివి కావున రాక్షసుఁడవు కమ్మని ఆతని శపించెను. ఆతఁడును రాధను నూఱేండ్లు భూలోకమున మానవస్త్రీవై పుట్టుమని శపించెను. గోపికలును నామెతోడనే యుందురు కావున, గోలోకమున నొక్క కృష్ణుఁడుండి యేమిచేయఁగలఁడు. అందువలన భూలో

కమున సారసమును ప్రవహింపఁజేయుటకై తానును భూలోక
మున నవతరించెను. బృందావనమున రాధ. నిత్య గోపికలతో
రాసలీల లొనర్చెను. కంసాదులను సంహరించుటకై అక్రూ
రుని వెంటఁబోయినది లీలాకృష్ణుఁడే. నిత్య కృష్ణుఁడు
'బృందావనం పరిత్యజ్య పాదమేకం నగచ్ఛతి' బృందావన
మునువదలి ఒక్క అడుగైన నావలఁబెట్టలేదు.

బ్రహ్మకును నైదుతల లుండెడివి. శివునకును నైదు
తల లున్నవి, పెద్దరికము నేను గొప్పయనిన నేను గొప్పయని
తగవులాడుకొనిరి. బ్రహ్మకడ నాయుధములు లేవు. పుస్తకము,
జపమాల. కమండులువు కలవు. శివునివద్ద త్రిశూలము కలదు.
ఇద్దరును పోట్లాడుకొనఁగా శివుఁడు త్రిశూలముచే బ్రహ్మ
యొక్క పై శిరస్సును గొట్టెను. అది బదరీక్షేత్రము దగ్గఱ
పడెను. అందువలన దానికి బ్రహ్మకపాలమను పేరువచ్చెను.
అచ్చట పితృదేవతలకుఁ బిండమునుబెట్టిన ముక్తిపొందెదరని
శాస్త్రము. బ్రహ్మతల తెగఁగానే బ్రహ్మహత్యాదోషము శివున
కంటెను. ఆతఁడా కపాలముతో దేవతాలోకములో ముష్టి
యెత్తుకొనుచుండెను. ఒక దినమున లక్ష్మీదేవి శివునకు
గడపకు ఆవల నొక పాదమును, ఈవల నొక పాదమునుబెట్టి
ముష్టివైచెను. అట్లువైచిన బయటనుండిన వాని పాపములు
పెట్టినవారి కంటును. ఆ బ్రహ్మహత్యాపాతకము లక్ష్మీదేవి
కంటెను. ఆ సంగతిని విష్ణువు తెలిసికొని శక్తిని గూర్చి
తపస్సుచేసెను, ఆ కల్పమున భగవానుఁడు శక్తిరూపమున
వ్యక్తమయ్యెను. విష్ణువునకు శక్తి ప్రత్యక్షమై యిట్లనెను :-

"నీభార్య బ్రహ్మహత్యాపాతకము పోవలయుననిన నాకు పదు
నెనిమిదక్షౌహిణీలు నరబలిని యొసంగవలయును" అనఁగా విష్ణు
విట్లనెను :- "నేను కృష్ణావతార మెత్తఁబోవు చున్నాను.
అప్పుడు పదునెనిమిదక్షౌహిణీల బలియొసంగఁగలను," అట్లే
కృష్ణావతారమునఁ గౌరవపాండవులకు యుద్ధమును గల్పించి
అందు బదునెనిమిదక్షౌహిణీలు చచ్చునట్లొనర్చెను.

అట్టి శ్రీకృష్ణావతారము శ్రావణ బహుళ అష్టమీ, రోహిణీ నక్షత్రమున వచ్చెను. ఆ దినమున పగలు ఉపవాసముండి రాత్రివేళ శ్రీకృష్ణునిఁ బూజించి పాలు, మీగడ, జున్ను, పెరుగు, వెన్న, మోడికారము, పండ్లు మొదలగునవి నివేదించి, అందఱకును బ్రసాదమును బంచవలయును ఆరాత్రి శ్రీకృష్ణ భజనములతో జాగరణ మొనర్చి నవమీ దినమునఁ బారణ మొనర్పవలయును. ఉట్లు కొట్టవచ్చును. శ్రీ కృష్ణావిర్భావమును భాగవతమునుండి చదివి వినిపింపవలయును. వినవలయును. శ్రీకృష్ణ లీలలను నాటలపాటల నాడవలయును.

## వినాయక చవితి

వినాయక చవితి భాద్రపద శుద్ధ చవితినాఁడువచ్చును. ఆదినమున సిద్ధి వినాయకునిఁ బూజించుకొనవలయును,

వినాయకుని జన్మమును గూర్చి యిట్లు చెప్పెదరు. ఒక దినమునఁ బార్వతీదేవి అభ్యంగన స్నానము చేయుచు నలుగు పిండితో నొక విచిత్ర బాలకుని బొమ్మను జేసి దానికిఁ బ్రాణమును బోసెను. ఆ విగ్రహము మానవుని తల. నాల్గు

చేతులు. పెద్ద బొజ్జ, మరుగుజ్జు చేతులు, మరుగుజ్జు కాళ్లుగల బొట్టిగ నుండెను. తాను అభ్యంగన స్నాన మొనర్చుచు నా బాలకుని నెవరిని లోనకు రానీయవలదని చెప్పి కావలి పెట్టెను.

ఇంతలో శివుడే వచ్చెను. ఆ బాలకుడు లోపలికి రాకుండ శివునే అడ్డగించెను. తన యింటికి రాకుండ నడ్డగించుటకు వీడెవడని, శివుడు తన త్రిశూలముతో వాని తలను నరుక వాడిచెను. పార్వతి వచ్చి చూడగా తన బిడ్డ చచ్చిపడియుండెను. ఆమె చాల దుఃఖించెను. ఆమెను దుఃఖోపశమన మొనర్చి, పిల్లవానిని దాను బ్రదికించెదననెను. ప్రమథ గణములతో నే జీవి ఉత్తర తలాపి పెట్టుకొని పరుండెనో ఆతలను గోసికొని రమ్మని యాజ్ఞాపించెను. ఒక ఏనుగు ఉత్తర తలాపి పెట్టుకొని పరుండి యుండగ ప్రమథగణములు ఆ ఏనుగు తలను గోసి తెచ్చిరి. శివుడా తల నా బాలుని మొండెమున కంటించి ప్రాణమును బోసెను అందువలన నాతడు గజ ముఖుడయ్యెను: బొజ్జ వ్రేలాడు చున్నది కావున లంబోదరుడయ్యెను.

బ్రహ్మ దేవతా గణములను సృష్టించి వారి కొక నాయకు నేర్పఱుప దలచెను. ప్రతి దేవతయు దానే నాయకుడు కాదలచి ముందుకు వచ్చిరి. బ్రహ్మ ఒక పందెమును బెట్టెను. ఈ చరాచర జగత్తును ముందుగా నెవడు చుట్టి వచ్చునో, ఆతనికి దేవతా గణపతిత్వ మిత్తుననెను. అప్పు

డింద్రుఁడు చైత్రవమును, అగ్ని తన వాహనమగు మేఁకను. యముఁడు దున్నను, నైరృతి మనుష్యుని, వరుణుఁడు మొసలిని వాయువు జింకను ఇట్లు సమస్త దేవతలును బరువిడ నారంభించిరి. మన లంబోదరుఁడును దనవాహనమగు మూషికమును నిలువఁబెట్టి దానెక్కి చల్ చల్ అనెను. అది కదల లేదు. అందఱును ముందు పరువిడుచుండిరి. గజముఖునకుఁ దొందఱ కలిగి దానిని బాదుట కారంభించెను. ఇంతలో నారదుఁ డచ్చటికి వచ్చెను. నారదుఁ డిట్లనెను. "లంబోదరా! నీకును అధికారకాంక్ష కలదా ?"

లంబోదరుఁ డిట్లనెను.– "అధికార కాంక్ష లేనివాఁ డెవఁ డుండును ?"

నారదుఁ డిట్లనెను :– "అట్లైన నా ఎలుకను వదలి వేయుము. ఆ యధికారము నీకు వచ్చు నుపాయమును జెప్పెదను" గజముఖుఁ డా మూషికమునువదలివైచెను. అప్పుడు నారదుఁడు నేలపై 'రామ' నామమును వ్రాయించి దాని చుట్టును మూఁడు సార్లు ప్రదక్షిణమును జేయించెను. లంబోదరుఁ డట్లే ప్రదక్షిణ మొనర్చి తర్వాత సిద్ధుని గలిసి బ్రహ్మ దగ్గఱకుఁ బోయిరి. అప్పుడు బ్రహ్మదేవునితో నారదుఁ డిట్లనెను :– "దేవా ! ఈ లంబోదరుఁడు పృథివి చుట్టును మూఁడుసార్లు ప్రదక్షిణమును జేసినాఁడు. కావున వీనికి గణాధిపత్యము నొసంగుఁడు".

బ్రహ్మ యిట్లనెను :- "ఇంకను వారందఱును పరు
వెత్తుచునే యున్నారే. మఱుగుజ్జువాఁడును, లంబోదరుడును,
బరువుగల తలగలవాఁడగు నీతఁడెప్పుడు మూఁడుసార్లు ప్రదక్షిణ
మొనర్చినాఁడు ?"

నారదుఁ డిట్లనెను :- "మీ వేదము సత్యమందురా ?
అసత్యమందురా ?"

బ్రహ్మయిట్లనెను :- "వేదములు పరమసత్యములు."

నారదుఁడిట్లనెను :- "వేదములకు సంబంధించిన ఉపని
షత్తులలో నిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ యథైవ వటబీజస్థః ప్రాకృతశ్చ మహాద్రుమః
తథైవ రామబీజస్థం జగదేతచ్చరాచరమ్॥

చిన్నదగు మఱ్ఱివిత్తనమునుండి గొప్పదగు మఱ్ఱిచెట్టెట్లుద్భ
వించినదో, అట్లే 'రామ' బీజమునుండి యీ చరాచరజగత్తు
ఉద్భవించినది.

కావున 'రామ' నామము చుట్టును దిరిగినాఁడు కావున
నీతఁడు సమస్త భూమండలమును ప్రదక్షిణమును మూఁడు
సార్లు చేసినవాఁడగుచున్నాఁడు. కావున నీతనికి గణపతిత్వ
మునకుఁ బట్టాభిషేకము చేయఁదగును.

బ్రహ్మ అంగీకరించి ఆతనికి పట్టాభిషేక మొనర్చెను.
శ్రీ తులసీదాసును ఇట్లనినాఁడు 'మహిమా జాసు జానగణ
రావూ ప్రథమపూజయత నామప్రభావూ' రామనామ ప్రభా

వము గణపతికి బాగుగాఁ దెలియును. ఆతఁడా నామప్రభా
వము వలనఁ బ్రథమ పూజ్యుఁడయ్యెను.

లంబోదరుఁడు గణపతి కాఁగానే ఆనందమున నృత్యము
చేయుచుండెను. ఆ నృత్యమునుగాంచి సుంద్రుఁడు నవ్వెను.
దానినిఁగాంచి గణపతి చంద్రుని ముఖమును జూడరాదని
శపించెను. ఆకాశమునందుండిన జంద్రుని నెవరు చూడకుం
దురు? అందఱును బ్రార్థింపగా నాభాద్రపద శుద్ధచవితి
నాఁడు చూచిన నీలాపనిందలు వచ్చుననెను.

ఒకనాఁడు శ్రీకృష్ణుఁడు పాలుపితుకుచుండఁగా నా
పాలలోఁ జంద్రబింబమును గాంచెను. ఆతనికట్లే నీలాప
నిందలు వచ్చెను. గణపతిపూజచేసికొని ప్రయత్నింపఁగా నా
నీలాపనింద పోయెను.

ద్వారకానగరమున సత్రాజిత్తను యాదవుఁడు సూర్యుని
భక్తుఁడు. ఆతఁడే పరికరములు లేకయే సూర్య లోకమునకుఁ
బోయి వచ్చుచుండెడువాఁడు, సూర్యుఁ డాతని భక్తికి సంత
సించి శమంతకమను మణి నొసంగెను. దానిని ధరించి అపర
సూర్యునివలె వెలుఁగుచు ద్వారకా నగరమునకు దిగెను.
అది రోజునకు రెండు పుట్లు బంగారమును బెట్టును. అంద
ఱాశ్చర్యమును జెందిరి. శ్రీకృష్ణుని కా సంగతి తెలిసెను. ఆ
మణి తనదగ్గఱ ఉండఁదగిన దనుకొని, ఆ మణినిఁ దనకొసం
గిన ననేక మణుల నిచ్చెదనని చెప్పిపంపెను సత్రాజిత్తు దాని

నోసంగ నిరాకరించెను. శ్రీకృష్ణుఁ డూరకుండెను. మఱునాఁడు సత్రాజిత్తు తమ్ముఁడు ప్రసేనుఁ డా మణిని ధరించి రథము మీఁద వేఁటకు బోయెను. అప్పుడు నా కాంతిగల వస్తువును గాంచి ఒక సింహ మాతనిపైఁ బడెను. సింహ మాతనిఁ జంపి మణి నెత్తుకొనిపోవుచుండ జాంబవంతుఁ డదిచూచి, యాసింహ మును జంపి, దానిని దీసికొనిపోయి, అతఁడుండు గుహాలోఁ దన కూఁతురగు జాంబవతి ఉయ్యాల పందిరికి కట్టెను. ఇట్లుండ ద్వారకకుఁ బ్రసేనుఁడును రాలేదు, మణియును రాలేదు. కారణమేమై యుండునని శ్రీకృష్ణుఁడీ మణి కావలయునని అడిగినాఁడు కావున తనతమ్ముని నాతఁడే చంపి మణిని దాఁచి యుండనోపునని భావించి అందఱికిని జెప్పెను. శ్రీకృష్ణుని మీఁద నీ యపవాదు ద్వారకానగరమంతటను వ్యాపించెను. పాలలోఁ జంద్రుని జూచుటచే నీయపవాదు వచ్చినది. దీనినిఁ బోఁగొట్టుకొనుటకై తాను రథమునెక్కి వెంట కొందఱు పెద్ద మనుష్యులను కూడ వెంటఁబెట్టుకొనిపోయెను. ఎచ్చట ప్రసేనుని శవము పడియుండెనో అచ్చట పరిశీలింపఁగా సింహము యొక్క అడుగులు కనఁబడెను. ఆ యడుగులనుబట్టి పోఁగా నొక ఎలుఁగును సింహమును బోరాడుకొనిన గుర్తులగుపడెను. అచ్చట సింహము చచ్చిపడియుండెను. తరువాత నెలుఁగు బంటు పాదచిహ్నములను బట్టి పోఁగా నది ఒక గుహాలోనికి దారి తీసెను. అందఱిని బయటనుంచి తా నొంటరిగా గుహ లోనికిఁ బోయెను. అచ్చట పసిపిల్లయగు జాంబవతి మంచము

పైనఁ గట్టఁబడిన మణిని గాంచెను. ప్రయత్నము సఫలమైన దను ధైర్యము వచ్చెను. అతఁ డా మణిని దీసికొనిపోఁబోగా నా నల్లనివానిని గాంచి పిల్ల యేడువసాగెను. ఆ యేడ్పును విని లోపలనుండి జాంబవంతుఁడు వచ్చెను. శ్రీకృష్ణునకును జాంబవంతునకును నిరువదెనిమిది దినములు పోరు జరిగెను. జాంబవంతుఁడు చిరంజీవి యగుటచే జావఁడు అయితే శ్రీకృష్ణుని పిడికిటిపోట్లకుఁ జాల నొచ్చెను అప్పు డీతఁడు సామాన్యుఁడు కాఁడు. నా ప్రభువగు రాముఁడే కావలయునని గ్రహించి పాదములపైఁ బడెను. అనేక స్తోత్రము లొనర్చెను. శ్రీకృష్ణుఁడు తానేలవచ్చెనో చెప్పఁగా జాంబవంతుఁ డా మణిని, జాంబవతి నొసంగెను. శ్రీరామావతారంబున రాముని బలమును గాంచి యాశ్చర్యపడి లోలోన యిట్లనుకొనెను :- 'శ్రీరాముఁడు మిత్రపక్షములో నున్నాఁడు. ఎదిరి పక్షములో నుండిన నా బలము నొక్కసారి చూపింపగల' ననుకొనెను. శ్రీరాముఁ డది గ్రహించి తాను కృష్ణావతారమునఁ బ్రసాదింతుననెను. అది యిప్పుడు జరిగెను శ్రీకృష్ణుఁ డామణిని తనతోడ వచ్చిన పెద్దలకుఁ జూపించి, తీసికొనిపోయి సత్రాజిత్తున కొసంగెను. సత్రాజిత్తు సిగ్గుపడి ఆమణిని, తనయొక్క యేకైక పుత్రికయగు సత్యభామనుగూడ ఆతనికొసంగెను. అంతటితో శ్రీకృష్ణునిమీఁదఁగల నపవాదు నమసెను. ఎవ రీ కథను విని పూజాక్షతలను శిరస్సున వేసికొందురో, వారికి నీలాపనిందలు పోవు నని చెప్పెదరు.

గణపతి విగ్రహమును మృత్తికతోఁ జేయించి నవ రాత్రములు చేయవలెను. ఆతని కిరువదొక్క పత్రములు పూజకు ప్రీతిగనుండును. తప్పక ఉండ్రాళ్లు నివేదింపవలయును. ముఖ్యముగఁ బిల్లలు వినాయకుని వారి పలకలు, పుస్తకములు పెట్టుకొని పూజించుకొందురు. వినాయకుఁడు విద్యాప్రదాత. ఆతని తల ఏనుఁగుతల. 'గజానాం మందబుద్ధిశ్చ' అనుటచే మన మందబుద్ధి నాఁతడు గ్రహించి మనకు సునిసితమగుబుద్ధి నొసంగును. దేవతలందఱు పద్దతియు నంతియే. విష్ణువు లక్ష్మినిఁ దాను గైకొన్నాఁడు. మనకు వైరాగ్యరూపమున దారిద్ర్యము నొసంగును. "ఎవ్వని రక్షింప నిచ్ఛయింతును నేను అతని విత్తంబునే నపహరింతు"నని వామనావతారమునఁ జెప్పెను. శివుఁడు దారిద్ర్యమును గ్రహించి మనకష్టైశ్వర్యము లొసంగుచుండును. గణపతి పూజాసమయమున శమంతకోపాఖ్యానమును గణపతి జననమును, గణపతి పురాణమును ప్రవచనమును జేసియును, జేయించియును కాలమును గడుపవలయును. గణపతి విగ్రహమును నీటిలోనుండి తెచ్చిన మట్టితోఁ జేసినాము. కావున మరల దానినిఁ జక్రితో సహా నీటిలోఁ గలుపవలయును, లేదా చెట్లపాదులలోఁ బెట్టవలెన నా కూరగాయలు బాగుగా ఫలించునందురు

## పరివర్తనైకాదశి

భాద్రపదశుద్ధ ఏకాదశికి పరివర్తనైకాదశియని పేరు ఆషాఢశుద్ధ ఏకాదశినాఁడు స్వామిదక్షిణ తలపెట్టి

తూర్పునకుఁదిరిగి పరుండినాడుకదా! సరిగా రెండు నెలలకు వచ్చు నీ ఏకాదశినాఁడు స్వామి ఎడమచేతి మీఁదకుఁ దిరుగును. అనఁగా ఋతుపవనము మారును ఇఁక మీఁదట నీశాన్య ఋతుపవనము వీవ నారంభించును. ఇఁకఁ దూర్పు వానలు వచ్చును. కొందఱి మతమునఁ జాతుర్మాస్యలు రెండు నెలలకే పూర్తియగుచున్నవి. రెండుపూర్ణిమాస్యలు, రెండమావాస్యలు వచ్చినవి కావునఁ జాతుర్మాస్యలైనవని కొందఱమతము. నారదపరివ్రాజకోపనిషత్తులలో నీ విధానమును గూడ చెప్పినారు. ఈదినమున సన్న్యాసులు విశ్వరూపయాత్రయని ఏగ్రామమున వీరు చాతుర్మాస్య లొనర్చుచున్నారో ఆగ్రామమందలి పొలిమేరకుఁబోయి, అచ్చట విశ్వరూపసందర్శన యోగమును పారాయణ మొనర్చెదరు. కొందఱు పదమూఁడవ యధ్యాయమునుగూడ పారాయణ మొనర్చెదరు. తరువాత నింటికి వచ్చెదరు.

## మహాలయ పక్షము

భాద్రపదశుద్ధ పూర్ణిమ దాఁటగనే పాడ్యమినుండి అమావాస్యవఱకు మహాలయపక్షము. మహాలయ మప్పుడు జరిగినదని చెప్పెదరు. ఈ పక్షమున వారివారి పితరులకు మహాలయ శ్రాద్ధములను జేయుదురు. పోయినవారు యతులైనచో యతిమహాలయమునాఁడు వారికిఁ బెట్టవలయును. అన్నశ్రాద్ధమును జేయవచ్చును. లేదా తిల తర్పణము నైనను జేయ

వలయును. ఈ పదునైదు దినములు క్షౌరమునుగాని, అభ్యం గనమునుగాని చేయరాదు. మహాలయ అమావాస్యనాఁడు బ్రాహ్మణునకుఁ బెట్టుకొని పితృదేవతలపేరున హోమోమన వేయ వలయును.

## దేవీ నవరాత్రులు

ఆశ్వీజ శుద్ధ పాడ్యమినుండి తొమ్మిదిరోజులు దేవీ నవ రాత్రములు, 'అగ్నేస్త్వేన మహేశ్వరీయను' టచే భగవానుఁ డగ్ని తత్త్వము నాధారముఁ జేసికొని మహాశక్తియైనది. ఆమె అనేక రూపముల వ్యక్తమైనది. స్త్రీ మయమంతయు శక్తి స్వరూపమే, లలిత, కాళీ. చండికా, మాహేశ్వరీ, వారాహీ, రాజరాజేశ్వరీ, సరస్వతీ, వైష్ణవీ, దుర్గా, భార్గవీ, మొదలగునవన్నియును శక్తి స్వరూపములే. ఒకేశక్తి అనేక రూపములు ధరించి, ఆయాకాలములలో నద్భుతమగు కార్యము లొనర్చినది. మహిషాసురునిఁ జంపి మహిషాసుర మర్దని యైనది. ఇది మైసూరులో జరిగినది. శక్తి నుపాసించు వారు దేవీ నవరాత్రులను గలశమున నావాహ్నించి చేయవల యును. ఈ కాలమున శక్తిగా భావనచేసి సువాసినీపూజయు, పసిబాలికలను బాలారూపమున భావించి పూజింపవలయును. కుంకుమపూజ చాల ముఖ్యము.

ఇందులో మహానవమీ వచ్చును. ఆ రోజుతో దేవీ పూజ పూర్తి కావలెను. పదవ దినమున విజయదశమి. ఆ దినమున శమీపూజ నొనర్చెదరు. జమ్మిచెట్టు చాల శ్రేష్ఠ

మైనది: రావి చెట్టుజమ్మి కట్టెలలో విద్యుచ్ఛక్తి యెక్కువగ నున్నది. యజ్ఞములలో నీ దారువులతో మథించి, అగ్ని నుత్పాదన మొనర్చి, యా యగ్నిచేత హోమములు చేయుదురు.

పాండవులు వనవాసమొనర్చిన తరువాత నొక వత్సర మజ్ఞాతవాసము చేయవలసి వచ్చినది. అప్పుడు వారు మారు వేషములను వేసికొనవలయును గదా! అప్పుడు వారందఱు యాయుధములను, శవాకారముగ నొక కట్టగగట్టి ఒక జమ్మి చెట్టునకు వ్రేలాడఁగట్టిరి. అవి పాండవులకు మాత్రము ఆయుధములుగఁ గనఁబడును. కాని యితరులకు శవముగఁదోఁచును. వాని దగ్గఱ కెవ్వరునుబోరు, సరిగా నజ్ఞాతవాసము పూర్తియైన దినముననే పాండవులను గనుగొనుటకై కౌరవసేన యంతయును వచ్చెను. వారుత్తరమున నుండి విరాటుని గోవులను గ్రహించిరి. అప్పుడు బృహన్నల రూపమున నుండిన నర్జునుఁడు ఉత్తరకుమారుని సారథిగాఁ దీసికొనివచ్చి యా యాయుధములుండు జమ్మిచెట్టును బూజించి తమ ఆయుధములను దీసికొనెను. వానిని గ్రహించి తానొక్కఁడే సమస్త కౌరవసేనను సమ్మోహనాస్త్రముచే మూర్ఛపడునట్లు చేసి, వారి తలగుడ్డలలోని పొత్తికలనుగోసి ఉత్తర కొసంగెను. విజయుఁడు ఆదినమున వారి నందఱను జయించినాఁడు కావున దానికి విజయదశమి యను పేరువచ్చెను. ఆరోజున దేవుని దీసికొని పరువెత్తుచుఁ బారువేఁటకుఁ బోవుదురు. శమీపూజ

నొనర్చిన తరువాత చిన్న చిన్న కాకితములమీఁద నీ క్రింది శ్లోకమును వ్రాసి పంచుచుందురు.

శ్లో॥ శమీ శమయతే పాపం శమీ శత్రువినాశనీ
అర్జునస్య ధనుర్ధారీ రామస్యప్రియ దర్శనమ్॥

ఈ శ్లోకము నందఱును జదువుకొన వలయును. అట్లు చదువుకొనిన నా సంవత్సరము వారికి విజయము కలుగునని శాస్త్రము.

శ్రీరామచంద్రుఁడు రావణుని మీఁదకు యుద్ధమునకుఁ బోయినరోజు కూడ యిదియేనని చెప్పుదురు. విశాఖ్యములను ప్రారంభింపఁ దలంచినను నీదినమునఁ బ్రారంభించుట యుక్తము.

## అట్లతద్ది

భాద్రపద బహుళ విదియనాఁడు అనఁగా మహాలయ పక్షములోనే ఉండ్రాళ్ళ తద్దె వచ్చును. ఆశ్వయుజ బహుళ విదియనాఁ డట్లతద్దె వచ్చును. ఈ వ్రతమునకు బృహత్యుమా వ్రతమని పేరు, చంద్రునితోఁ గూడిన పార్వతీదేవిని యీ రెండు పండుగలలోను బూజింపవలయును భాద్రపద బహుళమున వచ్చు రోజున నుండ్రాళ్లు చేయవలయును. ఆశ్వయుజ బహుళ విదియనాఁడు వచ్చు పండుగకు అట్లు చేయవలయును. ఉమాదేవిపూజను జేసికొని వీనిని నివేదించిన వారికి సౌభాగ్య మెక్కువగ నుండునని చెప్పుదురు. ఈ తద్దెలకు ముందురోజున గోరంటాకును దెచ్చి దానిని రుబ్బుకొని గోళ్ళకును, అర

చేతులకును, కాళ్ళగోళ్ళకును బెట్టుకొందురు. ముఖ్యముగ స్త్రీలు పెట్టుకొందురు. ఇది వర్షాకాలము. స్త్రీ లెప్పుడును వానలోఁ దిరుగుచుందురు. నెమ్ములోఁ జేతులను బెట్టి పని చేయుచుందురు. వారిచేతులయొక్కయు, కాళ్ళయొక్కయు, గోళ్ళలోఁ గ్రిములు చేరవచ్చును. నెమ్మె చేరవచ్చును. గోరంటాకు వానిని హరించును. దీనిని ముత్తైదువులు తప్పక పెట్టుకొనవలెను. విధవలు పెట్టుకొనరాదు. దీనిని ధరించిన స్త్రీకి సౌభాగ్యకరము. ఆ దినమునఁ బిల్లలును, పెద్దలును తెల్లవారుజామున నన్నమును దిని ఊయల లూగెదరు. ఊయల లూగుచోఁ గంటిలో నున్న దోషములును, గుండెల దోషములును బోయి ఆరోగ్యము నిచ్చును. ఇది స్త్రీలకే యేర్పడినది. దీనిని తప్పక ఆచరింపవలెను.

## నరకచతుర్దశి - దీపావళి

దీపావళీ పండుగు ఆశ్వీజ బహుళ అమావాస్యనాఁడు వచ్చును. దానికి ముందురోజున నరకచతుర్దశి వచ్చును. నరకచతుర్దశి చాలముఖ్యమైనది. వరాహావతార సమయమున వరాహమూర్తి హిరణ్యాక్షునిఁజంపి భూమి నుద్ధరించెనుగదా! భూదేవి విష్ణుపత్నియే. మన సనాతన సుప్రభాతములోఁ జెప్పఁబడినదికదా!

శ్లో॥ సముద్రవసనే దేవి పర్వత స్తన మండితే

విష్ణుపత్ని నమ స్తుభ్యం పాదక్షేమం క్షమస్వమాం॥

ఓ భూదేవీ! నీకు సముద్రములే కట్టుకొనినచీరె. పర్వతములే స్తనములు, అనఁగాఁ దల్లియెట్లు తన స్తన్యముచేఁ దనబిడ్డలను బోషించునో, అట్లే కొండలు నీకు స్తనములగుటచే వాని మీఁద వర్షించిన జలములు భూమిని సస్యశ్యామలము నొనర్చి జనులను గాపాడుచున్నది. ఆమె విష్ణుపత్ని. విష్ణువునకు శ్రీలక్ష్మియును, భూలక్ష్మియును నిద్దరును భార్యలే. అట్లు విష్ణుపత్నివైన నీకు నమస్కారము. నీమీఁదఁ బాదములను మోపుచున్నాను క్షమింపుము. దీనినిఁబట్టి మనకు విష్ణువు తండ్రి, లక్ష్మితల్లి. ఆమె తోఁబుట్టువు చంద్రుఁడు మామ. చందమామయని పిలుచుచుందుముకదా! విష్ణు వందఱకును అనఁగా మనముత్తాతకును, తాతకును, తండ్రికిని, మనకును, మన కొడుకులకును, మనుమలకును. మనిమనుమలకును దండ్రి కావున నాతని భార్య యందఱకును దల్లి కావున, నామె సోదరుఁడు చంద్రుఁ డందఱకును మామయే.



వరాహావతారము కాలంలో భూమికిని వరాహునికిని బుట్టినవాఁడే నరకుఁడు. ఈతఁడు దుర్మార్గుఁడయ్యెను. అనేక మంది రాజస్త్రీలను బలవంతమునఁ దీసికొనివచ్చి బంధించెను. ఇంకను దేవతలందఱకును జాలబాధను గలిగించుచుండెను. దేవతలందఱును వచ్చి శ్రీకృష్ణునకు మొఱపెట్టుకొనిరి. శ్రీకృష్ణుఁడా మొఱల నాలించి నరకుని మీఁదకు యుద్ధమునకుఁ బోయెను. వెంట సత్యభామనుగూడ తీసికొని పోయెను. ఆతనితో ఘోరయుద్ధ మొనర్చెను. సరిగా నాశ్వయుజ బహుళ స్వాతీనక్షత్రయుక్త చతుర్దశినాఁడు సరిగా చంద్రోద

యము వేళకు ఆతఁడు మరణించెను. ఆతఁడు భూమి పుత్రుఁడు కావున మన మంతఱము నభ్యంగన స్నానమొనర్ప వలయును. తెల్లవాఱుజామున దీపమును వెలిగించి, టపాకులు మొదలగు మందుసామానును నరకునిపై జరిపిన యుద్ధమను భావముతోఁ గాల్పవలెను. తరువాత సూర్యోదయమునకుఁ దలంటుకొని అభ్యంగనస్నాన మొనర్పవలయును. తెల్లవారితే దీపావళీ అమావాస్య వచ్చును ఆరోజున దుర్మార్గుఁడు చచ్చినాఁడను సంతోషమునఁ బండుగు చేసికొందురు ప్రొద్దు గ్రుంకఁగానే దీపములను వెలిఁగించి, టపాకులు, పువ్వొత్తులు మొదలగు మందుసామానును గాల్చవలయును. అది సంతోషమున నరకునిపై సాధించిన విజయానందము రూపమున నివి యన్నియును జేయుచుందురు. అదియునుగాక వర్షకాలము వెళ్ళిన తరువాత చెత్తచెదారమంతయును గ్రుళ్లియుండును. దోమలెక్కువగ నుండును ఈదీపములలో దోమలన్నియును బడి చచ్చిపోవును గ్రుళ్లిన దుర్గంధములో ననేకములగు విషక్రిము లుండవచ్చును. ఈ మందుసామానును గాల్చుటచే గంధకము, సూరేకారము మొదలగు ద్రవ్యముల పొగ వలన దుష్టక్రిమి నశించును. ఇఁకఁ దరువాత వాతావరణమంతయు పరిశుద్ధమై ఆరోగ్యమునుగూర్చును. ఇది శరదృతు ప్రారంభము. ఆశ్వీజ కార్తీకమాసములు శరదృతువు. వసంత, శరదృతువులు చాల ముఖ్యమైనవి. సమశీతోష్ణము గలిగి, లోకమున కారోగ్యమును గలిగించును. వసంతఋతువు శరదృతువులందు సూర్యుఁడు భూమధ్యరేఖ పరిసరములం

పొందును. ఈ దీపావళీ ఉత్సవము ఏ మతమువారైనను జేయదగినదే.

## కార్తీక మాసము

న కార్తీక సమో మాసః - న దేవః కేశవాత్పరమ్
న చ వేద సమం శాస్త్రం - న తీర్థం గంగాయా సమమ్ ॥

కార్తీకముతో సమానమగు మాసము లేదు. కేశవుని కంటె మించిన దేవుడు లేడు. వేదముతో సమానమగు శాస్త్రము లేదు. గంగతో సమానమగు తీర్థము లేదు. కార్తీకమాసము స్నానమునకును, దీపమునకును ప్రసిద్ధి. ఇది శివకేశవులకు సమానమగు [illegible]. ఉదయముననే స్నానము చేయవలెను. మంత్రయుక్తముగఁ జేయుట శ్రేష్ఠము. ద్విజులు పితృదేవతలకు తర్పణములు విడువవలయును. సూర్యునకును తర్పణము చాల ముఖ్యము. స్నానము కాగానే పొడిబట్టలు కట్టుకొని అనుష్ఠానమును జేసికొనవలయును. స్త్రీలు దీపారాధనలు చేయుచుందురు. తడి బట్టతో దీపమును వెలిగింపరాదు. కార్తీక పురాణమును శ్రవణ మొనర్పవలయును. దాన ధర్మాదు లొనర్పవలయును. భూమిలో నే విత్తనము నాటిన నా ఫలమెట్లు ప్రచురముగ లభించునో, అట్లే ఏ దానము నొనర్చిన నా వస్తువులు ప్రచురముగ ముందు జన్మమున లభించును. దానము త్యాగమునకు ప్రతీకము. వస్త్రదానము, హిరణ్యదానము, గృహదానము, భూదానము, కన్యాదానము, శాకదానము, నవధాన్యములు, శయ్యా,

పంచము మొదలగునవికూడ దానము చేయవలయును. అన్నిటికంటె నన్నదానము శ్రేష్ఠమైనది. బీదల కన్నదాన మొనర్పవలయును. కొందఱు ఈ నెలంతయును నుపవాస మొనర్చెదరు. చాలమంది ఏకభుక్తముగ నక్తభోజన మొన ర్చెదరు. అదియు నుండఁజాలనివారు ఛాయానక్తముగ నుందురు. అనఁగా సాయంత్రము మూఁడు, నాల్గు గంటలకు భోజన మొనర్చెదరు. ప్రొద్దు క్రుంకఁగానే ఆకాశదీపమును బెట్టెదరు. స్తంభమును బాతి చిల్లులు పొడిచిన కుండలోఁ బ్రమిదనుబెట్టి దానిలో దీపము నుంచెదరు. దాని నందఱును దర్శించి నమస్కరించెదరు కార్తీక మాసమునఁ బ్రతిదినమును నక్తముండఁ జాలనివారు సోమవారములందును, పూర్ణిమ యందును నక్తముండవచ్చును.

కార్తీక శుద్ధ విదియనాఁడు భగినీ హస్త భోజనము చేయవలయును. సోదరి యుండినఁ బ్రత్యేకముగ వారింటికిఁ బోయి, అచ్చట భోజనమును జేసి, చెల్లెలి కైనఁ జీర, రవిక రూపమున నిచ్చి రావలయును. దీనివలన నామెకు సౌభాగ్య మును, సోదరున కాయుష్యమును వృద్ధియగు నందురు.

## ఉత్థానైకాదశి

కార్తీక శుద్ధ ఏకాదశినాఁడు భగవంతుఁడు నిద్రనుండి లేచును ఆషాఢశుద్ధ ఏకాదశినాఁడు పరుండినవాఁ డీనాఁడు లేచును. అనఁగా నిప్పటికి మేఘములన్నియును దొలఁగి

టచే మన యాంధ్రదేశమున నదే శాలవాహైనది. మార్గశిర శుద్ధ పంచమినాఁడు కల్యాణమొనర్చుట బాగుగనుండును. మార్గశిరశుద్ధ ఏకాదశి గీతాజయంతి. ఆదినమునఁ గురుక్షేత్రమునఁ బాండవులకును గౌరవులకును యుద్ధము ప్రారంభము కాఁగా నర్జునుఁడు తాతలను, తండ్రులను, మామలను, బావలను, కొడుకులను జంపవలసి వచ్చినదేనని, యుద్ధమును జేయనని కూర్చుండఁగా నాయనకు దత్త్వోపదేశమునొనర్చి ఆతనికి విధ్యుక్తకర్మము చేయవలసినదని బోధించెను. అదియే భగవద్గీత. భగవద్గీతతో సమానమగు గ్రంథము లేదు.

శ్లో॥ గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్ర విస్తరైః
యా స్వయం పద్మనాభస్య ముఖ పద్మా ద్వినిసృతా.

భగవద్గీతను గాన మొనర్పవలయును. అనేక శాస్త్రములేల? అది స్వయముగఁ బద్మనాభుని యొక్క ముఖపద్మమునుండి వెలువడినది.

మన అదృష్టము మనకు దత్త్వశాస్త్రము స్వయముగ భగవంతుఁడే చెప్పినాఁడు. ఒక మతమునకు దూత చెప్పినాఁడు. ఇంకొక మతమునకుఁ గుమారుఁడు చెప్పినాఁడు.

గీతా సిద్ధాంతము ప్రకారము ఈ శరీరముగాని, ఇంద్రియములుగాని మనోబుద్ధి చిత్తాహంకారములుగాని తాను గాదు. తాను కేవలము ఆత్మస్వరూపము. అది నశించునది కాదు. పరిణామము చెందునది. వికార రహితమైనది. సర్వవ్యాపకమైనది. అఖండము, అనీహము, అనవద్యము, అతు

లితమైనది. శాశ్వతము, సచ్చిదానంద స్వరూపమైనది. ఇది అందరి హృదయములందును గలదు. అందఱ హృదయము లందలి నేను నేనను వస్తువొక్కటే. నేను అనుదానికి బహు వచనము లేదు. ప్రథమ పురుషయగు అతఁడు+అతఁడు=వారు అను బహువచనము వచ్చినది. మధ్యమ పురుషకు నీవు+నీవు =మీరు అను బహువచనము వచ్చినది. ఇఁక నుత్తమపురుష యగు నేను అనుదానికి బహువచనము లేదు. నేను+నేను= నేను. మేము, మనము అని ఉత్తమ పురుషకు బహువచన మును జెప్పుచున్నాము. అది తప్పు. అది పరమార్థమైన సరి గాదు. వ్యావహారికమే. నేను + నీవు = మనము అయినది. నేను+అతఁడు=మేము అయినది. ఆత్మను తెలిసికొని శాస్త్రీ యముగ సమస్త కార్యముల నొనర్పవలయును. 'స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః' అని శ్రీకృష్ణుడు చెప్పి నాఁడు. ఏమియును జేయఁజాలనప్పుడు కర్తృత్వ భోక్తృత్వము లను మన నెత్తినఁ బెట్టుకొనక ఆయనకు శరణాగతి నొనర్ప వలయును. దీనిలో భక్తి, కర్మ, జ్ఞానములను, జివరకుఁ బ్రపత్తినిఁ జెప్పెను. ఇవన్నియును వేఱువేఱు కావు. 'కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః' జనకాదులు కర్మలవలననే సిద్ధిని బొందిరి. ఇచ్చట 'హి' అను నుపసర్గను బెట్టి కర్మ చేతనే సంసిద్ధి కలుగునని నొక్కి చెప్పెను.

'భక్త్యామామభిజానాతి యావాన్ యశ్చాస్మితత్త్వతః' తాత్త్వికముగ నేనెట్టివాఁడనో తెలియవలయునవిన భక్తి చేతనే తెలియ వలయును. భక్తికి ప్రాధాన్యత వచ్చినది.

"సర్వం కర్మాఖిలం పార్థ ! జ్ఞానే పరిసమాప్యతే" కర్మలన్నియును జ్ఞానములోఁ బరిసమాప్తి చెందును. దీనినిబట్టి జ్ఞానమే గొప్పదని తోఁచుచున్నది. "భక్తేస్తు యా పరా కాష్ఠా సైవం జ్ఞానం ప్రచక్ష్యతే" భక్తియొక్క పరాకాష్ఠ స్థితికే జ్ఞానమనిపేరు. గీతయందు సమస్త ఆధ్యాత్మిక విషయములు చర్చింపఁబడినది.

గీతాజయంతి రోజున గీతాపుస్తకము నూరేగించి దానికి బూజ యొనర్పవలయును. గీతాసప్తాహము చేయుట మంచిది. ఆవారము దినములు గీతాశ్రవణ మొనర్చినఁ దత్త్వము బాగుగాఁ దెలియఁగలదు. శ్రీమంతులు గీతల నుచితముగాఁ జదువుకొనఁగల వారలకుఁ బంచుట మంచిది. కొందఱు పదునెనిమిది దినములు ప్రవచనమును జేయించెదరు.

## హనుమద్వ్రతము

మార్గశిరశుద్ధ త్రయోదశినాఁడు హనుమద్వ్రతము నాచరింపవలయును. కొన్ని ప్రాంతములలో నీ దినము హనుమంతుఁ డవతరించిన దినమని చెప్పుదురు. అట్లు కాదు. ఈ దినము సీతాన్వేషణమునకై లంకకుఁ బోయినరోజు. ఆరోజు మంగళవారము వచ్చినదఁట, అందువలన శనివారమువలె మంగళవారమును హనుమత్పూజకు పర్వదినము. ఈ హనుమద్వ్రతమునఁ జాల తతంగము కలదు. కదళీవృక్షములను నొక వనమువలె నాటవలయును. ఒకనికి హనుమంతుని వేషమును వేయవలయును. అతఁడు సీతాన్వేషణమును నటింపవలయును.

పూజావిధానమును, రాత్రి జాగరణ పద్ధతియును గలదు. ఈ వ్రతమువలన హనుమ దనుగ్రహము కలుగును.

## ధనుర్మాసము

సరిగా నీ మార్గశిర బహుళమందే ధనుర్మాసారంభ మగును. అధికమాసము వచ్చిన సంవత్సరమున మార్గశిర శుక్లమందే ధనుర్మాసము ప్రారంభమగును. శుక్లపక్షమున ధనుర్మాసముండి, అందులో శుక్ల ఏకాదశి కలిసినచో నది ముక్కోటి ఏకాదశియగును. లేకుండిన ముక్కోటి ఏకాదశి పుష్యశుద్ధ ఏకాదశినాఁడు వచ్చును. సాధారణముగ నీ ధనుర్మాసము డిశెంబరు 16 వ తేదీకి వచ్చును. ధనుర్మాసమున సూర్యుఁడు ధనుస్సులో నుండఁగనే స్వామికిఁ బూజచేసి బాల భోగమును నైవేద్యమిడవలయును. సూర్యుఁడు మకరములోఁ బ్రవేశించు వఱకును నిట్లు జరుపవలయును.

## మకరసంక్రాంతి (ఉత్తరాయణము)

ఇది సాధారణముగఁ బుష్యమాసమున వచ్చును. డిశెంబరు 14 వ తేదీ యగును. సూర్యుఁడు దక్షిణముగాఁ బయనించి యీనాఁ డుత్తర ముఖముగఁ దిరిగి ఉత్తరముగఁ బ్రయాణించును. ఉత్తరాయణ పుణ్యకాలమునఁ బితృతర్పణము లొనరించెదరు. వివిధదానము లొనరించెదరు. ముఖ్యముగ గుమ్మడికాయ దానము నొసంగెదరు. దానిమీఁదఁ గొంచెముగ బంగారమును గ్రుచ్చెదరు. ఓపికనుబట్టి యెన్ని

దానముల్లైన నీయవచ్చును. అనంత ఫలదము కదా! కొంద
ఱీ సంక్రాంతినాఁడు ముఖ్యముగ స్త్రీలు బొమ్మలను బెట్టు
కొందురు. ముత్తైదువలను బిలిచి ప్రసాదములను బంచెదరు.
సావిత్రీ గౌరీ నోములను నీ మాసములోనే చేయుచుందురు.

## మాఘ మాసము

'ఆ, కా, మా వై'లో నిది యొకటి. మాఘమాసమున
స్నానము ముఖ్యము. దీక్షగా మాఘస్నానములు చేయుదురు.
భగవంతుఁడు జలరూపమున నామాసములో నంతటను
వ్యాపించి యుండునఁట స్నానము కాఁగానే తర్పణాదులు
వదలవలయును దానము లొనర్పవలయును.

## భీష్మ ఏకాదశి (భీమ ఏకాదశి)

మాఘశుద్ధ ఏకాదశికి భీష్మైకాదశియనియును, భీమై
కాదశి యనియును బేరుకలదు. భీష్ముఁడు భారతయుద్ధమునఁ
బదునొకండవ దినమునఁ బడిపోయెను. ఆతఁడు పరమ భాగవ
తోత్తముఁడును, బ్రహ్మచర్య నిష్ఠుఁడును, దపస్వియు,
భక్తుఁడు నగుటచే నాతనికి స్వచ్ఛందమరణము జరుగవలసి
యుండెను ఆతఁడు పడిపోయినపుడు దక్షిణాయనమే ఆతఁ
డుత్తరాయణము కొఱకు వేఁచియుండెను. చివరకు మాఘ
శుద్ధ ఏకాదశినాఁడు శరీరమును విడిచిపెట్టెను.

దీనికి భీమైకాదశి యనియును బేరుకలదు. అందఱును
నేకాదశులుండెడువారు. కాని భీమున కాఁకలి యెక్కువగుటచే
ఏకాదశినాఁ డుపవాసముండలేక పోయెడువాఁడు. ఆతనికి

జాలచింతగా నుండెడిది. దానికి వ్యాసులవారొక ఉపాయమును జెప్పెను. సంవత్సరములో నేదోఒక ఏకాదశి నెన్నుకొని ఆ ఏకాదశినాఁ డుపవసించిన సంవత్సరమందలి అన్ని ఏకాదశులం దుపవసించిన ఫలము రాఁగలదనెను. ఆతఁడట్లే మాఘశుద్ధ ఏకాదశినాఁ డుపవసింపఁదలఁచెను. ఆఁకలి మండి పోవుచుండెను ఉండలేకుండిన ఫలాహారమును జేయుదురు. కావున నాతనికి ఫలాహారములు తేఁబడెను. ఒక వేయి పుండ్రేక్షు ఖండములును, ఒక వేయి టెంకాయలును, ఒకలక్ష అరఁటిపండ్లును తేఁబడెను. ఆదినమున వాని నన్నిటిని ఫలాహారముగ భక్షించి, ఎప్పుడెప్పుడు తెల్లవారునా, ఎప్పుడెప్పుడు ద్వాదశీపారణ మొనరింతునా యనుకొనెను. ఈ ఏకాదశికి భీమైకాదశి పేరుకూడ వచ్చినది.

## మాఘపూర్ణిమ

ఇదియు ఆ, కా, మా, వై లోనిదే. ఇదియును వ్యాస పూర్ణిమయే. ఈ దినమున సముద్రస్నాన మొనర్చుట ముఖ్యము. తర్పణాదు లొనర్పవలయును.

## మహాశివరాత్రి

మాఘ బహుళ చతుర్దశి రోజున మహాశివరాత్రి వచ్చును. ఆదినమున నుపవాసముండి, శివునకు అభిషేకము లొనర్పవలయును. లింగోద్భవకాలము వఱకును అభిషేక పూజాదులొనర్చి అప్పుడు నివేదన చేయవలయును తెల్లవారు వఱకు జాగరణ మొనర్పవలయును. మన ఆంధ్రదేశములో

శివరాత్రులందు శ్రీశైలము, కాళహస్తి, కోటప్పకొండ, ద్రాక్షారామము మొదలగు దివ్యక్షేత్రములు కలవు.

ఆ దినమున శివుఁడు అర్ధరాత్రివేళ జ్యోతిర్లింగ స్వరూపమున వ్యక్తమయెను. దాని అంతు ఎవరికిని జిక్కలేదు. దేవతలందఱును నీ లింగముయొక్క అంతు కనుగొనఁదలఁచిరి. వారికోరికపై బ్రహ్మ తన వాహనమగు హంసనెక్కి పైకిఁ బోయెను. విష్ణువు వరాహరూపమును ధరించి, భూమినిఁ ద్రవ్వుకొనుచుఁ గ్రిందకుఁ బోయెను. ఎవ్వరికిని నా అనంతమూర్తి అంతుచిక్కలేదు. అప్పుడు బ్రహ్మ ఒక యుక్తి నొనర్చెను. శివుని శిరస్సునుండి పడునుండిన నొక మొగలిపువ్వును బట్టుకొని, దానితో నిట్లనెను. 'ఓ కేతకీ పుష్పమా! నేను నిన్ను శివుని శిరస్సునుండియే తెచ్చుచున్నా'నని చెప్పెను. అందుల కా పుష్ప మంగీకరించెను. దేనికైనను సాక్ష్యముండవలయును. సాక్షిగా నుండుమని నందీశ్వరునిఁ గోరుకొనెను. నంది 'అబద్ధమాడ'ననెను, తనకొఱకు అసత్యమును జెప్పుమని బ్రహ్మ బ్రతిమలాడెను. శివుఁడా నందినడుగఁగాఁ దలతో నాపువ్వును శిరస్సుపైనుండి తెచ్చినట్లూపి, తోఁకతోఁగాదని అడ్డముగ నూపెను. విష్ణువు నాకు శివలింగముయొక్క అంతు చిక్కలేదని యొప్పుకొనెను. ఆతఁడు సత్యమును జెప్పినాఁడు కావున నాతనికిఁ బూజయు, దేవాలయములు నుండునట్లను గ్రహించెను. బ్రహ్మ అబద్ధమును జెప్పినాఁడు కావున నాతనికి దేవాలయమును, అర్చనయును లేకుండునట్లు శపించెను.

అందువలన బ్రహ్మకు దేవాలయములును లేవు. అర్చనయును లేదు. కేతకీ(మొగలి)పుష్పము శివున కిష్టమైనదై నప్పటికిని అది అబద్ధమాడినది కావున నది తనపూజకు బనికిరాదని నిషేధించెను. ఇంక నంది తలతో నసత్యమును జెప్పి, తోకతో నిజమును జెప్పినది కావున దాని తోకకుఁ బూజ జరుగున ట్లొనర్చెను. ప్రొద్దునలేవఁగానే దానిముఖమును జూడరాదని శపించెను. అందువలన గోవును లేవఁగానే తోఁక భాగమును జూడవలయుననియును, ముఖమును జూడరాదనియు శపించెను శివరాత్రి మరునాఁడు పారణమొనర్చి ఏకభుక్తముండవలెను.

## హోళికా పూర్ణిమ

ఫాల్గుణశుద్ధ పూర్ణిమనాఁడు హోళికా పూర్ణిమ వచ్చును దీనికొక గాథయున్నది. అది యిచ్చట క్లుప్తముగ వ్రాయఁబడుచున్నది. ఈపండుఁగును ముఖ్యముగ నుత్తరభారతీయులు పాటించెదరు ఆదినమున స్నానాదులొనర్చుకొని భజనలతోడను, మేళతాళములతోడను నానందోత్సవము నొనరించుకొందురు. గులాం, కుంకుమ మొదలగు రంగు చూర్ణములను బరస్పరము మీఁదఁ గొట్టుకొందురు అలాగే రంగు నీటిని బిచ్చికారులతోను, చెంబులతోడను గొట్టుకొందురు. వారెంతటి గొప్పవారైనను, రంగులో ముంచివేయుదురు. ఆ యానందమును జెప్పసాధ్యముకాదు. స్త్రీలును నీ యుత్సవమును బాటించెదరు. ఆరోజున భోగిమంటలు వేయుదురు.

హోళికను దిట్టుచుందురు. కొందఱు ఆభాషలోఁ బద్ధిబూతు లనే తిట్టుచుందురు.

హిరణ్యకశిపుని భార్యపేరు లీలావతి. ఆమె గర్భవతి యయ్యెను. హిరణ్యకశిపునకు సనకసనందనాదుల శాపవశమున శ్రీహరి యనిన సరిపడదు. హరియనిన నాతనికి పరమ ద్వేషము. చెవులతో నాతని నామమును వినఁడు. కంటితో నాతని చిత్రమునైనను గాంచఁడు. లీలావతి గర్భవతిగా నుండఁగా హిరణ్యకశిపుఁడు బ్రహ్మనుగూర్చి తపము నొనర్పఁ బోయెను. తాను దపమును జాలించి వచ్చువఱకు నా గర్భమట్లే పెరుగకుండునట్లుచేసి వెడలిపోయెను. ఆతఁడు చేసిన దపస్సునకు మెచ్చి, బ్రహ్మ ప్రత్యక్షమై వరములను గోరుకొమ్మనెను. అప్పుడు హిరణ్యకశిపుఁడిట్లు కోరుకొనెను:- "దేవా! నేను పగలు చావరాదు, రాత్రియందును జావరాదు. ఇంటిలోను జావరాదు. ఇంటిబయటను జావరాదు. క్రిందను జావరాదు, పైనను జావరాదు. మనుష్యునిచేతను జావరాదు, మృగముచేతను జావరాదు, ప్రాణముగల వస్తువు చేతను జావరాదు. ప్రాణములేని వస్తువుచేతను జావరాదు." ఇట్లు కోరఁగా బ్రహ్మ తథాస్తనెను. ఆ వరగర్వమున నింటికి వచ్చెను. ఆతఁడింటికి రాకమునుపు ఇంద్రుఁడు ఈ రాక్షసునకుఁ బుట్టినవాఁ డెంతదుర్మార్గుఁడగునోయని ఆమెను జెఱఁ బట్టఁగా నారదుఁడు ఆతనికి నచ్చఁజెప్పి విడిపించెను. ఆతని కొక కుమారుఁడు పుట్టెను. ఆతనిపేరు ప్రహ్లాదుఁడు. ఆతఁడు

చిన్నప్పటినుండియే హరిభక్తుఁడయ్యెను. లీలావతి భక్తురాలు కావున నీతఁడును నామె పోషకమున హరి భక్తుఁడైనాఁడనుకొని, ఈతనిని దన చెల్లెలగు హోళికకు పెంపకమున కొసంగి, హరి విరహితునొనర్పఁగోరెను. ఆతని కెంతగాఁ జెప్పినను హరిభక్తిని వదలలేదు. ఆతఁడు విడువలేదు. ఆతఁ డెల్లప్పుడును 'హరినారాయణ గోవిందా! అచ్యుత మాధవ గోవిందా!' అని సంకీర్తన మొనర్చుచుండెడువాఁడు. హిరణ్యకశిపునకు జాలగాఁ గోపముకలిగి ఆతనిఁ జంప నుంకించెను. ముందుగాఁ గొండపైనుండి దొరలించిరి, కాని చావలేదు. సముద్రములోఁ బడవైచిరి, కాని మునిఁగి పోలేదు. చివరకు అగ్నిలోఁ బడవేయఁదలఁచెను. హిరణ్యకశిపుఁడు రాక్షస భటులకు చితిని బేర్చి ప్రహ్లాదునిఁ గొనిపోయి దానిలోఁ బడ వేయుమనెను. హిరణ్యకశిపుని రాజధాని మూలస్థానము. దాని నిప్పుడు మూల్టాన్ అందురు. ఇప్పటికిని ఆ పట్టణమునకు ఊరి బయట ప్రహ్లాదుని అగ్నిప్రవేశమును జేయించిన చితిస్థానమున్నది. అందఱును మహామ్మదీయులైనను వారికా నేల మట్టియందు గౌరవము కలదు.

హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదునిఁబిలిచి యిట్లనెను :– "ప్రహ్లాదా! నీవు పోయి ఆ చితిపైఁ గూర్చుండుము."

అప్పుడు ప్రహ్లాదుఁడిట్లనెను :– "నాయనా! అత్తయ్య (హోళికా) కూడ కూర్చుండితే నేను కూర్చుండెదను."

రాక్షసులకు జలస్తంభన, అగ్నిస్తంభన విద్యలు తెలియును. స్తంభనవిద్య మంత్రపూర్వకముగను, యంత్రపూర్వకముగను, తంత్రపూర్వకముగను గలదు. కొన్ని ఓషధులతో స్నానమొనర్చినను, బట్టలను నా ఓషధులలో ముంచి ఆరవేసినను వానిని ధరించిన గాలవు. అట్లే మంత్రమును జపించినను శరీరము కాలదు. ఇవన్నియును హోళికకు దెలియును. ఆమె యెట్లైనను ప్రహ్లాదుని జంపుటకై పిల్లవాని నెత్తుకొని అగ్నిలోఁ గూర్చుండెను. ఎప్పుడును ప్రహ్లాదుఁడు 'హరి నారాయణ గోవిందా – అచ్యుత మాధవ గోవిందా'యని సంకీర్తనచేయు వాఁడు ఇప్పుడు 'రామ రామ రామ' యని ఊపిరాడకుండ చేయుచుండెను. ఏలననఁగా రామనామము జ్యోతిర్మయ నామము. రకారమను నగ్నిబీజముతోఁ బ్రారంభమైనది. ఇంతలో నా యగ్నిహోళికను గాల్చివేసినది. ప్రహ్లాదుఁ డట్లేయుండెను. రామనామ మవిరళముగ జరుగుచుండెను. అంతఁ బ్రహ్లాదుఁడు చితిమీఁదనుండి దుమికి తండ్రి కడకుఁ బోయెను. ఆతఁడు ప్రహ్లాదునితో నిట్లనెను:– 'ఏమిరా! అగ్నిలోఁ గూర్చుండ లేదురా? అత్తయ్య ఎచ్చట నున్నది?',

ప్రహ్లాదుఁ డిట్లనెను :– "తండ్రీ! అగ్నిలోఁ గూర్చుంటినే. అత్తయ్య మసి అయినది.

శ్లో॥ రామనామ జపతాం కుతోభయం
సర్వతాప శమనైక భేషజమ్
పశ్యతాత ! మమగాత్ర సన్నిధౌ
పావకోఽపి సలిలాయతేధునా॥

నాయనా! రామనామమును జపించిన భయమేమున్నది? అది సర్వతాపములను శమింపఁజేయుటకు దివ్యమగు నౌషధము. నాశరీరమును జూడుఁడు. అగ్నియును జల్లని నీరువలె నైనాఁడు

పసివానినిఁ జంపుటకు క్రూరురాలై చేసిన పనికి హోళికను దిట్టుచుందురు. ప్రహ్లాదుని అగ్నిలోఁ బ్రవేశింపఁజేసిన గుర్తుగా మంటలువేయుదురు. ప్రహ్లాదుఁడు భగవన్నామ ప్రభావమున నిరపాయముగ నగ్నినుండి వచ్చినాఁడు కావున, సంతోషసూచకముగ వసంతములతో నానందోత్సవము చేసి ందురు. ఇప్పుడు సమయానుసారముగ ననుసంధించు ప్రార్థనా శ్లోకములు కొన్ని యిచ్చట యీయబడుచున్నవి.

నిద్రలేవఁగానే అఱచేతిని జూచుకొని పఠించునది.

శ్లో॥ కరాగ్రే వసతే లక్ష్మీ కరమధ్యే సరస్వతీ
కరమూలేతు గోవిందః ప్రభాతే కరదర్శనమ్॥

నిద్రలేచి నేలపై నడుగుపెట్టునపుడు పఠించునది.

శ్లో॥ సముద్రవసనే దేవి! పర్వతస్తన మండితే
విష్ణుపత్ని నమస్తుభ్యం పాదక్షేపం క్షమస్వమామ్॥

విఘ్నములు పోవుటకు

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే॥

శ్లో॥ అగజానన పద్మార్కం గజానన మహర్నిశం
అనేకదం తం భక్తానా మేకదంత ముపాస్మహే।

శ్లో॥ వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ !
నిర్విఘ్నం కురుమే దేవ ! సర్వకార్యేషు సర్వదా॥

## సుప్రభాతమ్

ఇచ్చట వేంకటేశ్వర సుప్రభాతమును జదువవచ్చును.

శ్లో॥ బ్రహ్మామురారీ త్రిపురాంతకారీ
భానుఃశశీ భూమిసుతో బుధశ్చ
గురుశ్చ శుక్రః శని రాహు కేతవః
కుర్వంతు సర్వేమమ సుప్రభాతమ్॥

## భాగవతస్మరణము

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుకశౌనక భీష్మ దాల్భ్యాన్
రుక్మాంగదార్జున వశిష్ఠబలి విభీషణాది
పుణ్యానిమాం పరమ భాగవతాన్ స్మరామి॥

## పంచకన్యస్మరణము

శ్లో॥ అహల్యా ద్రౌపదీ తారా కుంతీమండోదరీ తథా
పంచకన్యాన్ స్మరేన్నిత్యం మహాపతక నాశనమ్॥

## చిరంజీవులు

శ్లో॥ అశ్వత్థామా బలి ర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః॥
జీవేత వర్షశతం సోఽపి సర్వవ్యాధి వివర్జితః॥

## ఆంజనేయ ధ్యానమ్

శ్లో॥ హనూమాన్ అంజనీసూనుః వాయుసూనుర్మహాబలః
రామేష్ట ఫల్గుణ సఖః పింగాక్షోమిత విక్రమః
ఉదధిక్రమణశ్చైవ సీతాశోక వినాశనః
లక్ష్మణ ప్రాణదాతాచ దశగ్రీవస్య దర్పహా
ఏతద్ద్వాదశనామాని కపీంద్రస్య మహాత్మనః
ప్రాతఃకాలే ప్రదోషే చ యాత్రాకాలేచ యఃపఠేత్
తస్య రోగభయం నాస్తి సర్వదా విజయీ భవేత్॥

## దశావతారములు

శ్లో॥ మత్స్యః కూర్మో వరాహశ్చ నృసింహో వామనస్తథా
రామోరామశ్చ కృష్ణశ్చ బుద్ధః కల్కీచతే దశ॥

## సంకట నాశక స్మరణము

శ్లో॥ హరం హరిం హరిశ్చంద్రం హనుమంతం హలాయుధమ్
పంచకం వై స్మరేన్నిత్యం ఘోరసంకట నాశనమ్॥

## సర్పభయము పోవుటకు

శ్లో॥ సర్పాపసర్ప భద్రంతే గచ్ఛ సర్పమహా విష
జనమే జయస్యయజ్ఞాంతే ఆస్తీక వచనస్మర॥
ఆస్తీకస్య వచస్మృత్వాయః సర్పో న నివర్తతే
శతధా భిద్యతే మూర్ధ్ని శింశవృక్షఫలం యథా॥

## గో వు న కు న మ స్కా ర ము

శ్లో॥ నమోగోభ్య శ్రీమతేభ్య సౌరభేయీభ్య ఏవచ
నమో బ్రహ్మసుతాభ్యశ్చ పవిత్రాభ్యో నమోనమః॥
గావో మమాగ్రతస్సంతు గావో పృష్ఠత ఏవ చ
గావోమే సర్వగాత్రేషు గవాం మధ్యేవసామ్యహమ్॥

## గు రు ధ్యా న ము

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్పరం బ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః॥
అఖండ మండలాకారం వ్యాప్తంయేన చరాచరమ్
తత్పదం దర్శితం యేన తస్మైశ్రీ గురవేనమః॥

## మే లు కొ లు పు

శ్లో॥ ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠగరుడధ్వజ
ఉత్తిష్ఠపుండరీకాక్ష త్రైలోక్యం మంగళం కురు॥

## రా మ ప్రా తః స్మ ర ణ మ్

శ్లో॥ ప్రాతః స్మరామి రఘునాథ ముఖారవిందం
మందస్మితం మధురభాషి విశాలఫాలం
కర్ణావలంబి చలకుండల గండభాగం
కర్ణాంత దీర్ఘనయనం నయనాభిరామం॥ 1

శ్లో॥ ప్రాతర్భజామి రఘునాథ కరారవిందం
రక్షోగణాయ భయదం వరదం నిజేభ్యః।
యద్రాజ సంసది విభజ్య మహేశచాపం
సీతా కరగ్రహణ మంగళమాపసద్యః॥

శ్లో॥ ప్రాతర్నమామి రఘునాథ పదారవిందం
పద్మాంకుశాది శుభచిహ్న సుఖావహం మే
యోగీంద్రమానస మధువ్రత సేవ్యమానం
శాపాపహం సపది గౌతమ ధర్మపత్న్యాః॥ 3

శ్లో॥ ప్రాతర్వదామి వచసా రఘునాథనామ
వాగ్దోషహారి సకలం శమలం నిహంతి।
యత్పార్వతీ స్వపతినా సహభోక్తు కామా
ప్రీత్యా సహస్ర హరినామ సమంజజాప॥ 4

శ్లో॥ ప్రాతః శ్రయే శ్రుతినుతాం రఘునాథమూర్తిం
నీలాంబుదోత్పల సితేతర రత్ననీలామ్।
ఆముక్త మౌక్తిక విశేష విభూషణాఢ్యాం
ధ్యేయాం సమస్తమునిభి ర్నిజ ముక్తిహేతుమ్॥

శ్లో॥ యః శ్లోకపంచకమిదం ప్రయతః పఠేద్ధి
నిత్యం ప్రభాత సమయే పురుషః ప్రబుద్ధః
శ్రీరామ కింకర జనేషు స ఏవ ముఖ్యో
భూత్వా ప్రయాతి హరిలోక మనన్యలభ్యమ్॥

పిడుగుపడునపుడు పఠించునది

శ్లో॥ అర్జునః ఫల్గునో జిష్ణుః కిరీటీ శ్వేతవాహనః
భీభత్సుర్విజయః కృష్ణః సవ్యసాచీ ధనంజయః॥

రామధ్యానము

శ్లో॥ రామోరాజమణిః సదావిజయతే రామంరమేశంభజే
రామేణాభిహతా నిశాచర చమూ రామాయ తస్మైనమః
రామాన్నాస్తి పరాయణం పరతరం రామస్యదాసోస్మ్యహం
రామేచిత్తలయః సదాభవతుమే భోరామ రక్షస్వమామ్॥

పాపవిముక్తి

శ్లో॥ శ్రీరామంచ హనూమంతం సుగ్రీవం చ విభీషణమ్
అంగదం జాంబవంతం చస్మృత్వా పాపైఃప్రముచ్యతే॥

సౌభాగ్యవృద్ధికి

శ్లో॥ ఉమా ఉషా చ వైదేహి రమా గంగేతి పంచకమ్
ప్రభాతేయః స్మరేన్నిత్యం సౌభాగ్యం వర్ధతేసదా॥

హనుమంతుని స్మరణము

శ్లో॥ ప్రాతః స్మరామి హనుమంత మనంత వీర్యం
శ్రీరామచంద్ర చరణాంబుజ చంచరీకం
లంకాపురీదహన వందిత దేవబృందక
సర్వార్థసిద్ధి సదనం ప్రథిత ప్రభావమ్॥ 1

శ్లో॥ ప్రాతర్నమామి వృజినార్ణవ తారనౌకా
ధారం శరణ్యముదితానుపమ ప్రభావమ్

సీతాధిసింధు పరిశోషణ కర్మదక్షం
వందారు కల్పతరు మవ్యయ మాంజనేయమ్॥ 2

శ్లో॥ ప్రాతర్భజామి శరణోపసృతాఖిలార్తి
పుంజ ప్రణాశన విధౌ ప్రథితప్రతాపమ్
అక్షాంతకం సకలరాక్షస వంశధూమ
కేతుం ప్రమోదిత విదేహసుతం దయాలుమ్॥ 3

శ్లో॥ ప్రాతరుత్థాయ యోనిత్యం హనూమంతం స్మరన్ హృదా
పఠస్ లోకత్రియం విష్వక్ విజయం లభతేనరః॥

శ్లో॥ అతులిత బలధామం హేమశైలాభదేహం
దనుజ వనకృశానుం జ్ఞానినా మగ్రగణ్యం
సకలగుణ నిధానం వానరాణా మధీశం
రఘుపతి ప్రియభక్తం వాతజాతం నమామి॥

## లక్ష్మి స్తుతి

శ్లో॥ త్రైలోక్య పూజితేదేవి కమలే విష్ణువల్లభే
యథాత్వం సుస్థిరా కృష్ణే తథాభవమయి స్థిరా
ఈశ్వరీ కమలా లక్ష్మీశ్చలా భూతిర్హరిప్రియా
పద్మా పద్మాలయా సంపద్రమా శ్రీఃపద్మధారిణి
ద్వాదశైతాని నామాని లక్ష్మీం సంపూజ్యయఃపఠేత్
స్థిరా లక్ష్మీః భవేత్తస్య పుత్రదారాదభిః సహా॥

## సరస్వతీ స్తుతి

శ్లో॥ సరస్వతీ మహాభాగే విద్యే కమలలోచనే
విశ్వరూపే విశాలాక్షి విద్యాం దేహి నమోస్తుతే॥

## సూర్య స్తుతి

శ్లో॥ వికర్తనో వివస్వాంశ్చ మార్తాండో భాస్కరో రవిః
లోక ప్రకాశకః శ్రీమాన్ లోకచక్షుర్మహేశ్వరః
లోకసాక్షీ త్రిలోకేశః కర్తాహర్తా తమిస్రహా
తపనస్తాపనశ్చైవ శుచిః సప్తాశ్వవాహనః
గభస్తిహస్తో బ్రహ్మా చ సర్వదేవ నమస్కృతః॥

## సూర్య నమస్కారములు

1. ఓం హ్రాం మిత్రాయ నమః
2. ఓం హ్రీం రవయే నమః
3. ఓం హ్రూం సూర్యాయ నమః
4. ఓం హ్రైం భానవే నమః
5. ఓం హ్రౌం ఖగాయ నమః
6. ఓం హ్రః పూష్ణే నమః
7. ఓం హ్రాం హిరణ్యగర్భాయ నమః
8. ఓం హ్రీం మరీచయే నమః
9. ఓం హ్రూం ఆదిత్యాయ నమః
10. ఓం హ్రైం సవిత్రే నమః
11. ఓం హ్రౌం అర్కాయ నమః
12. ఓం హ్రః భాస్కరాయ నమః
13. ఓం హ్రాంహ్రీం మిత్ర రవిభ్యాం నమః

14. ఓం హూ్రీ హ్రైం సూర్యభానుభ్యాం నమః

15. ఓం హ్రౌం హ్రః ఖగపూషభ్యాం నమః

16. ఓం హ్రాం హ్రీం హిరణ్యగర్భ మరీచిభ్యాం నమః

17. ఓం హ్రూం హ్రైం ఆదిత్య సవితృభ్యాం నమః

18. ఓం హ్రౌం హ్రః అర్క భాస్కరాభ్యాం నమః

19. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం మిత్రరవి సూర్య భానుభ్యో నమః

·0. ఓం హ్రౌం హ్రః హ్రాం హ్రీం ఖగపూష హిరణ్యగర్భ మరీచిభ్యోం నమః

21. ఓం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఆదిత్య సవిత్రర్క భాస్కరేభ్యో నమః

22. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః మిత్ర రవి సూర్యభాను ఖగపూషభ్యో నమః

23. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః హిరణ్యగర్భ మరీచ్యాదిత్య సవిత్రర్క భాస్కరేభ్యో నమః

24. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః మిత్రరవి సూర్య భాను ఖగపూష హిరణ్యగర్భ మరీచ్యాదిత్య సవిత్రర్క భాస్కరేభ్యో నమః

## అరుణనమస్కారము

శ్లో॥ వినతా తనయో దేవః కర్మసాక్షీ సురేశ్వరః
సప్తాశ్వస్సప్త రజ్జుశ్చ అరుణో మే ప్రసీదతు॥

## సూర్యధ్యానము

శ్లో॥ పద్మాసనః పద్మకరో ద్విబాహుః
పద్మద్యుతిః సప్త తురంగ వాహః।
దివాకరో లోకగురుః కిరీటీ
మయి ప్రసాదం విదధాతు దేవః॥

## శంకరవందనము

శ్లో॥ కుందఇందు దరగౌర సుందరం
అంబికాపతి మభీష్ట సిద్ధిదమ్
కారుణీక కరకంజ లోచనం
నౌమి శంకర మనంగ మోచనమ్॥

శ్లో॥ కర్పూరగౌరం కరుణావతారం
సంసారసారం భుజగేంద్రహారం
సదావసంతం హృదయారవిందే
భవం భవానీసహితం నమామి॥

## స్నానమంత్రము

శ్లో॥ గంగా గంగేచ యో బ్రూయాద్యోజనానాంశతైరపి
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం సగచ్ఛతి॥

అంబ ! త్వద్దర్శనాన్ముక్తిః నజానే స్నానజంఫలం
స్వర్గారోహణ సోపానే మహాపుణ్య తరంగిణి
విశ్వేశం మాధవం ధుండిం దండపాణిం చ భైరవం
వందే కాశీంగుహాం గంగాం భవానీం మణికర్ణికామ్॥

శ్లో॥ గంగే చ యమునే చైవ గోదావరి సరస్వతి
నర్మదే సింధుకావేరి జలేస్మిన్ సన్నిధిం కురు॥
పుష్కరాదీని తీర్థాని గంగాద్యాః సరితస్తథా
ఆగచ్ఛంతు పవిత్రాణి స్నానకాలే సదామమ॥
అయోధ్యా మథురామాయా కాశీకాంచీ హ్యవంతికా
పురీ ద్వారావతీ చైవ సప్తైతా మోక్షదాయికా॥

సూర్యునకు అర్ఘ్యమిచ్చు మంత్రము

శ్లో॥ ఏహి సూర్యసహస్రాంశో తేజోరాశే జగత్పతే ।
అనుకంపయమాం భక్త్యా గృహాణార్ఘ్యం ప్రసీదమే॥

మంగళము

శ్లో। మంగళం భగవాన్ విష్ణుః మంగళం మధుసూదన
మంగళం పుండరీకాంక్ష మంగళంగరుడధ్వజ॥
శీలాచల నివాసాయ నిత్యాయ పరమాత్మనే
సుభద్రా ప్రాణనాథాయ జగన్నాథాయ మంగళమ్॥
మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్॥

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు॥

ధర్మస్య జయోఽస్తు
అధర్మస్య నాశోఽస్తు
ప్రాణిషు సద్భావనాఽస్తు
విశ్వస్య కల్యాణమస్తు

ఓం శాంతిః శాంతిః శాంతిః.



# మా వద్ద దొరకు గ్రంథములు

| | |
|---|---|
| ఆధ్యాత్మిక సాధన | 5-00 |
| సంకీర్తన మీమాంస అర్థ పంచకము | 1-00 |
| శ్రీరామ మంత్రానుష్ఠానము | 12-00 |
| నామమహిమార్ణవము | 12-00 |
| హనుమన్నిష్ఠ | 5-00 |
| హనుమదుపాసన | 8-00 |
| పరమార్థ తత్త్వము | 2-00 |
| ధ్యాన పద్ధతి | 1-50 |
| నిత్యానుష్ఠానము | 1-00 |
| భగవన్నామ ప్రభావము | 1-50 |
| రామ నామ ప్రభావము | 1-00 |

భాగవత కథలు : 1, 8, 9, 10, 11, 12, 61, 62, 63 భాగాలు